శ్రీః

శ్రీరస్తు          శ్రీహయగ్రీవాయ నమః     శుభమస్తు

శ్రీమహాసరస్వత్యై నమః

శ్రీసీతాలక్ష్మణ హనుమత్సమేత శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః

శ్రీరుచిర మైన దుందుభీ తీరమందు మహిత శ్రీరామగిరి దివ్య మందిరమున !
జానకీ లక్ష్మణానిలజాఢ్యుడైన రమ్యగుణ శీలు శ్రీరఘురాము గొలుతు

శ్రీపాలమూరు (మహబూబ్‌నగర్) మహామండలాంతర్గత
శ్రీరఘుపతిపేట దుందుభీనదీతీర శ్రీరామగిరి

# శ్రీరఘురామ.- శతపారిజాతప్రబంధము

రచయిత

**శ్రీమాన్ నల్లదీగ శ్రీనివాసాచార్యులు *M.O.L.* (ఇందిరాల)**
శ్రీమదార్షకళాభారతీనిలయము - సికింద్రాబాద్
సికింద్రాబాద్ మహబూబుకళాశాలా విశ్రాంత ప్రధానాంధ్రాధ్యాపకులు

శ్రీఈశ్వరనామ సం. మధుమాసములు ౧౯౯౭

This book is published with the Financial Assistance of
"TIRUMALA TIRUPATHI DEVASTHANAM'S"
under their scheme aid to publish religious book

గ్రంథప్రచురణము : శ్రీమదార్షకళాభారతీనిలయము
గ్రంథము : శ్రీరఘురామ శతపారిజాతము - పద్యప్రబంధము
గ్రంథకర్త : శ్రీమాన్ నల్లదీగ శ్రీనివాసాచార్యులు (ఇందిరాల)
సికింద్రాబాద్ మహబూబ్ కళాశాల
విశ్రాంత ఆంధ్రోపాధ్యాయులు
గ్రంథ ముద్రణ సమయము : శ్రీఈశ్వర సం. హేమంత శశిరములు, 1997
గ్రంథముద్రణ సహాయ ప్రదాతలు :
తిరుమల తిరుపతి దేవస్థాన యాజమాన్యమువారు
మఱియు సాహితీప్రియులైన మిత్రబృందము
కృతిభర్త : శ్రీరామగిరి (రఘుపతిపేట)
శ్రీసీతారామచంద్రస్వామివారు
ప్రతులు : ౧౦౦౦
గ్రంథమూల్యము : 40 రూ. నలుబది రూపాయలు
(శ్రీస్వామివారి కైంకర్యమునకు
ఉపయోగింపబడును)
గ్రంథప్రాప్తిస్థానము : ప్రసిద్ధ గ్రంథవిక్రయశాలలు,
సికింద్రాబాద్, శ్రీరామ బుక్ డిపో
శ్రీరూపా బుక్ డిపో, సికింద్రాబాద్,
ప్యారడైజ్‌రోడ్
గ్రంథముద్రణస్థలము : శ్రీపద్మావతీ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, హైదరాబాద్
లేజర్ టైప్ సెట్టింగ్ : శ్రీసాయిమేధ కంప్యూటర్ క్రియేషన్స్,
కూకట్‌పల్లి, హైదరాబాద్.

# విషయసూచిక

# — : కృతిపతి: —



దివ్య దనవద్య దుందుభీ తీరమందు
రామగిరి మందిరమ్మున రమణి సీత –
సూరి సౌమిత్రి పావని చేరికొలువ
వరలు రఘురామునకు కృతిన్ భక్తినిడుదు.

శ్రీః

శ్రీమతేరామానుజాయ నమః

శ్రీసీతాలక్ష్మణ హనుమత్సమేత శ్రీరామగిరి -

శ్రీరామచంద్రస్వామినే నమః

# సంస్కృతి చిహ్న ప్రబంధము

శ్రీమహబూబునగర మండలాంతర్గత కల్వకుర్తి తాలూకా రంగాపుర గ్రామ వాస్తవ్యులు శ్రీమదాచార్య పురుషులైన శ్రీ. ఉ.వే.ప్ర. శ్రీమాన్ ఆసూరి మరిజ్గంటి జగన్నాథా చార్యులుగారి ద్వితీయ కుమారరత్నంబైన శ్రీమాన్ మరిజ్గంటి శఠగోపచక్రాచార్యులుగారి తిరునక్షత్రపు పవిత్రదినమున వారి స్మృతి చిహ్నముగా ఈ రామగిరి శ్రీరఘురామశతపారిజాతమను కృతిని శ్రీసీతారామచంద్రస్వామివారి పాదపద్మములలో సమర్పింపనైనది.

(౧) ఆసూరి వంశాబ్ధి భాసురచంద్రులౌ
 రంగాపురీశశోభాంగులైన
శ్రీజగన్నాథార్య శ్రీసూరిపుత్రులు
 అద్వితీయ ద్వితీయార్య గుణులు
శ్రీరంగకృష్ణ సచ్ఛ్రీరామచంద్ర ల -
 క్ష్మణ సూరి సోదర స్వాంతహితులు
శ్రీజగన్నాయకీ శ్రీజగన్నాథ శ్రీ
 శ్రీనివాసుల గన్న జ్ఞాన పితలు
మాకు కూతురు నిచ్చి మమ్మాదుకున్న
మామగారైన శఠగోప మాన్య గురుని

భవ్యసంస్మృతి కై రామభద్ర ! నీకు
ఈ మనోజ్ఞపు కృతిని నే నిచ్చుకొంటి.

(౨) భవ్యమౌద్గల్య గోత్రసంభావ్యులైన
పరమవిజ్ఞులు నాచార్యపురుషవరులు
స్వామి ! మీ పాదపద్మాలె ప్రాపటంచు
తాల్మి సేవించు మా గురూత్తముడు మిమ్ము.

(3) రామ ! యీసూరిజ్ఞాపకార్థముగ మీకు
రామగిరిధామ! ఈదివ్య రమ్యకృతిని
భవ్య భవదీయ మౌ పద పద్మయుగళి
నుంచితిని యేలి కృతిని నన్నొంచి యేలు

-: శ్రీశుభంభవతు :-



శ్రీః

శ్రీలక్ష్మీహయవదన పరబ్రహ్మణేనమః

శ్రీసరస్వత్యైనమః

శ్రీసీతాలక్ష్మణ హనుమత్సమేత శ్రీరామచంద్రాయనమః

శ్రీమహబూబు నగర మహా మండలాంతర్గత

శ్రీదుందుభీ నదీ తీరోపాంత - శ్రీరామగిరి -

# -: శ్రీరఘురామ - శతపారిజాతప్రబంధము :-

## (౧) ప్రథమగుచ్ఛము

శ్రీసీతాలక్ష్మణాఢ్యోऽసౌ।

శ్రీరామగిరి సుందరః।

శ్రీరామచంద్రోజయతాం

వర్ధతాం భువన త్రయే।

# శ్రీః

# శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

## శ్రీరామగిరిధామ –
## శ్రీరఘురామ సంస్తుతిః

శ్రీమన్ ! కృపాంబుధి నికేతన ! రామచంద్ర !
సీతా సుమిత్రతనయ్యానిల పుత్ర సేవ్య !
శ్రీమచ్ఛరోజ్జ్వల శరాసన హస్త పద్మ !
శ్రీరామ ! రామగిరిదామ ! నమామి తుభ్యమ్ ! ౧

కారుణ్య పూర్ణ కమలాయుత చారునేత్ర !
సుస్మేర దీర్ఘ పరిపూర్ణ శరన్ముఖేందో !
భక్తాభయప్రద కరాంబుజ చారు మూర్తే !
శ్రీరామ ! రామగిరిధామ ! నమామి తుభ్యమ్ '' ౩

కందర్పకోటి సమ సుందర దివ్యమూర్తే !
సాషాఢ నూత్న ఘననీరద నీలదేహ !
వాత్స పూర్ణదరసుస్మితలోచనాబ్జ !
శ్రీరామ ! రామగిరిధామ ! నమామి తుభ్యమ్ '' ౪

శ్రీదుందుభీ సురనదీ వర తీరదేశే
శైలోన్నతే లలితమందిరగర్భ గేహే !
సీతా సుమిత్రతనయ్యా నిలజార్చితాంఘ్రే
శ్రీరామ ! రామగిరిధామ ! నమామి తుభ్యమ్ '' ౫

రామాయ విశ్వ విభప్రద సద్గుణాయ
సీతామనోజ్ఞ హృదయాంబుజషట్పదాయ !
శ్రీలక్ష్మణా నిలజ సేవ్య పదాంబుజాయ
రామాయ రమ్య సుగుణాయ నమోఽచ్యుతాయ '' ౬

శ్రీరామశైల వరమందిర సుందరాయ
శ్రీచాప బాణ పరిభూషిత రాఘవాయ !
భక్తాభయప్రద కరాంబుజ భాసురాయ
రామాయ ! రమ్య సుగుణాయ నమోఽచ్యుతాయ ౭

ఇదం ముని జనేడితం
త్రిభువనావనం సుందరం
అనన్య వరరామ భూ
ధర నికేతనే మంజులం
మదీయ మతి సేవితం
రఘువరాబ్జ పాదద్వయం
చకాస్తు మమ మానసే
రహసి సీతయా చుంబితమ్ '' ౮

శ్రీరమ్య రామ శైలేఽస్మిన్
మైధిలీ లక్ష్మణాన్వితః
బాణ బాణాసనాఢ్యోఽసౌ
శ్రీరామో జయతాం భువి

-: శ్రీశుభంభూయాత్ :-

శ్రీః

శ్రీరస్తు

శ్రీ

శ్రీహయగ్రీవయానమః

శ్రీరామచంద్రస్వామినేనమః

# కృతి సమర్పణము

శ్రీమదన వద్య కరుణావిశేషమూర్తి !
మీరు పలికింప కృతిని పేర్మిన్ వచించి
రామ ! మీ పాదపద్మాల రక్తినిడితి
కృతిని గొని దాసు నిట భవత్కృపల గనుము

ఈ ధరాఖండ మందే శతాంశంబగు
అవని నేలిన నంత నధిపులమని
దుర్వార ఖర్వదుర్గర్వాంధచిత్తులై
పల్కు క్షుద్ర నరాధి పాధములను
వారి వైభవముల పల్కి సత్కవి తను
ధన్యుండనన్నట్లు తలవ నెపుడు
ఆటవికుండైన నాగుహునేలిన
నిను గొల్చుకైతయే నిక్కమనుచు
భక్త శబరిని నేలిన పరమపురుష !
నిష్ఫలాపేక్షకర్మునై నిన్ను బలికి
కృతి నొసంగితి స్వామి ! నీస్థితి నొసంగు
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ !

క్రూరదుష్పాలక ద్వారదేశంబుల
వెలుపలి యరుగు లందలరి మిగుల
పేరాస గల్గిన పెను కవీశ్వరులాది
విజ్ఞులమనువారు వినతి నుంద్రు
తనువుకూలెడిదాక తాపత్రయాత్ములై
ఇలలోన నీవిధిన్ మొలగి యుంద్రు
నిన్ను నావంతైన నెద నిల్పరెప్పుడు
పాండిత్య కవితల బాడొనర్తు
ఆవిధిన్ కైత నొరులకు నమ్ముకొనక (అందియిడక)
నీవె నన్నుద్ధరించెడి నేతవనుచు
కృతి నొసంగితి గైకొమ్ము నతులొనర్తు
రామగిరిధామ! శ్రీరఘురామ ! రామ ! ४

(1) పైతృకంబైన ధనము నావంతలేదు
రీతిదప్పుచు ధనము నార్జింపలేదు
నిలువధనమన్నదే లేదు నీరజాక్ష !
త్వత్పదార్చన ధనమె నా(2)పైతృదనము (నాదైనధనము) ౫

సత్యధార్మిక నైతిక స్వాంతమేమి
లేని పాలకులకు చేతులెత్తి కొలిచి
కృతుల నిడి శ్రీల గైకొని బ్రతుకుకంటె
ఉంచవృత్తిన జీవింప మంచి దగును ౬

శ్రీముడుంబాన్వయ శ్రీమురళీసహో
దరులు మీరూపులై దయల వెల్గి
ఆనతి నిడగ మీ యానతిగా నెంచి
మదిని మీపదములన్ మలచికొలిచి

---

(1) తల్లితండ్రుల భౌతికధనములేదు (2) నాతండ్రిధనము

శ్రీరామ ! మీకృపా శ్రీలెల్ల వ్రాయింప
వ్రాసితి నీకృతి శ్రీ సుమతిని
మీ పదపద్మాలె ప్రాపని యీకృతిన్
చేర్చితి మీపద శ్రీలలోన
కరుణ చెలువార కృతి నేలి కనికరించి
తావ కీ నాంఘ్రిదాసుల దాసుడైన
శ్రీనివాసుని రక్షింపు చేరికొల్తు
రామగిరి ధామ ! శ్రీరఘురామ ! రామ ! ౬

కృతిని బొందినవాడు ; నీకృతిని భక్తి
బరగి వ్రాసినవాడు నీ వసుధలోన
కృతి బహూకృతి బొందిన స్థితిపరుండు
శాశ్వితంబుగ నుంద్రు యశంబు గనుచు ౭

కృతిని మీకిచ్చి మీకృపావితతివెల్గ
మీపదాబ్జైక ధనమును చేకొనంగ
కనికరింపర ! మీదయాసరళి నొసగి
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ !

## కృతి బహూకృతి

ఆలపిళ్లలోకార్యులలర సంపన్నమౌ
శ్రీముడుంబాన్వయ శ్రీజలధిన
శ్రీతిర్మలాచార్య శ్రీపాదపద్మాల
కోవలో వెలసిన గుణ సుమతులు
ధీమతుల్ వెంకటరామదే శికులాది
భాగవతోత్తమ వంశజులకు
స్మారకచిహ్నమై మసలు నీసత్కృతి
మురళీధరాది సోదరులకెల్ల

కృతిని వాత్సల్యమున బహూకృతిగ నొసగి
బంధు భావంబు గదుర సంభావ్యనగుచు
మీపదశ్రీల జేరితి దాపునిడవె !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౯

మీ దయారసమొల్కనీ సోదరాళి
తావకీనాంఘ్రి కైంకర్య తత్పరులయి !
బాంధవాదర్శులౌచు పెంపొందిమిగుల
సకలసౌభాగ్యగరిమతో సుకృతులగుత ! ౧౦

సాదుడైన రామేశ్వరశాస్త్రిగారు
సురభివంశీయులెల్లరుసూరిహితులు
స్వామి! మీభృత్యభృత్యులు వారికెలమి,
కృతిబహూకృతి నిడిదుసత్కృతుడనైతి ౧౧

స్వామి! శ్రీరామచంద్ర! మీవారలైన
వీరలనునెల్లవేళల వేడ్కగలిగి
ఆయురారోగ్యభాగ్యాలనలరజేసి
ఇహపరశ్రీలతోనేలుమీశ! కృపల ౧౨

**-: శ్రీశుభంభవతు :-**

**శ్రీః**

శ్రీహయగ్రీవాయ నమః
శ్రీసరస్వత్యైనమః
శ్రీసీతాలక్ష్మణ హనుమత్సమేత -
శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# విజ్ఞాపనము

శ్రీరామభూధర నికేతన సుందరాయ
భక్త ప్రియాయ భవసాగరతారకాయ
ఆర్తావనాయ శరణాగతవత్సలాయ
సీతాసతీ ప్రియతమాయ నమోఽచ్యుతాయ

విశ్వశ్రీకి శ్రేయమును గూర్చునదియే కావ్యము. ఇది కాంతాసమ్మితము ఆర్షేయము చందోమయము, గుణ వతియు శీలవతియు స్వరూపవతియైన యిల్లాలు తనభర్తను సన్మార్గమునవలంబింప జేయుటకై తన హావభావాది విలాసములచే మధురమైన ప్రియమైన వాక్కులచే ధర్మప్రభోధముగా వించుచు నతనిని సన్మార్గమున వర్తింపజేయుచున్నట్లు కావ్యముకూడా అష్టాదశవర్ణనలతో రస గుణ రీతి వృత్తిధ్వని అలంకారాది కావ్యసంపదలచే ధీరోదాత్తాది గుణములుగల నాయకుల నడవళ్లతో అష్టవిధనాయికాది ప్రవృత్తులతో ''రామాదివత్‌వర్తితవ్యంనతు రావణాదివత్'' ఇత్యాది ధర్మోపదేశములతో శాసించుచు సామాజికుణ్ణి సన్మార్గమున బెట్టుటలో కృతకృత్యమగుచున్నది. అందువలననే వేదపురాణ ఇతిహాసాదులతోపాటు వానికంటె మిక్కిలి కావ్యశ్రీ విశ్వమున ఒక విశిష్ఠ స్థానమును సంతరించుకున్నది.

కావ్యశ్రీ ఛందో విశిష్టమైనది. ఇట్టికావ్యమునకు శ్రీకారం చుట్టినవాడు వాల్మీకి మహర్షి. ఆయన సంస్కృతకావ్య వాఙ్మయమున మొదటికవి (ఆదికవి).

ఆయన రచించిన కావ్యము మొదటికావ్యము- శ్రీమద్రామాయణ మహాకావ్యము. ఈ గ్రంథము భారతీయ సాహిత్యమునకే కాక విశ్వసాహిత్యలక్ష్మికే శిరోభూషణమై యలరారుచున్నది.

వాల్మీకి ఋషి; రామాయణం ఋషికావ్యము; ''ఆర్షవాక్యం ప్రామాణం'' అనుటచే రామాయణం భారతీయులకు ప్రమాణ గ్రంథమేకాక, పవిత్రగ్రంథము- ప్రశస్తగ్రంథము.

అట్లే ఆంధ్రభాషలో మొదటికవులు కవిత్రయమువారు వారు రచించిన కావ్యము మహాభారతము మొదటి కావ్యము. కవిత్రయమునుండి ఆంధ్రకవితాగంగా స్రవంతి అనేకానేకములుగా పాయలుపాయలుగా భిన్నభిన్న మార్గములలో ప్రవహించి చిత్రవిచిత్రములైన సాహిత్యపు పూదోటలను ఎలమావి తోటలను కోరకితముగ పల్లవితముగ పుష్పితముగ ఫలితముగ చెలువొందజేసి అసామాన్య కావ్యలక్ష్ములకు విహారోద్యానములుగా తీర్చిదిద్దుచూ పెంపుగావించుచున్నది.

ఆవిధముగా ఆంధ్రకవితాస్రవంతి ప్రవహించిన ఒక పాయయే శతకసాహిత్యము. ఈ సాహిత్యమునకు మొదట శ్రీకారము చుట్టినది సంస్కృత సాహిత్యమే., సంస్కృతమున శతకకావ్యములు కోకొల్లలు ఐనను ఇతర భాషలతోపాటు సంస్కృతసాహిత్యమునకూడాలేని శతకప్రక్రియను తెలుగు కవులైన వారు సంతరించుకొని భారతీయభాషా సాహిత్యములో శతకసాహిత్యమునకు ఒక ప్రత్యేక విశిష్టమైన స్వతంత్రప్రక్రియలలో స్థానమేర్పరచుకొని నిలుపుకున్నారు. మన శతకసాహిత్యమునకు తొల్దొల్త చిన్నని శ్రీకారము చుట్టినవారు కూడా నన్నయభట్టారకులు, భారతమున ఆస్తీకముని జనమేజయుని దర్శించుకొను సమయమున, మరియు ఉదంకుడు పాతాళమున ఆదిశేషుని దర్శించుకొను సమయమున శతక ప్రక్రియనుబోలు మకుటనియమముతో స్తుతించిన తీరు గౌరవప్రతిపత్తులతో కూడి మనోహరముగానుండును.

తదుపరి బద్దెనకవి రచించిన సుమతీశతము శతకవాఙ్మయమునకు ఆదిశతకమని శతకసాహిత్య విమర్శకారులు తలంచుచున్నారు. తరువాత వృషాధిపశతకము.

మన తెలుగుకవులు శతకమునకు కొన్ని నియముల నేర్పరచుకున్నారు. (1) మకుటనియమము (2) మకుటమునకు సరిపోవు వృత్తములనెన్నుకొనుట (3) భావము ఏపద్యమునకాపద్యముననే స్వతంత్రమైయుండుట (4) నీతి - జ్ఞాన - వైరాగ్య - హితము - భక్తి మొదలగు విషయములు ముఖ్యమైయుండుట (5) భగవంతునికి గురువులకు - తల్లితండ్రులకు అంకితముగా శతకము సమర్పించుట మొదలగు నియములచే స్వతంత్రమైన శతకప్రక్రియ ప్రారంభమై , గంగాప్రవాహమువలె పాయలుపాయలుగా ప్రవహించి అనితర సాధ్యమైన తెలుగుభాషాయోషకు కీర్తిప్రతిష్టలు సంతరించిపెట్టినది.

మన తెలుగుభాషలో ఆస్తికుడైన ప్రతికవి తాను రచింపబోవు కావ్యమునకు మొదట ఒక శతకమును రచించి తన యిష్టదైవమునకంకితము చేసి కావ్యమును ప్రారంభించి పూర్తిచేయుట పరిపాటియైనది. అందుచే తెలుగుకావ్య సాహిత్యమున శతకసాహిత్యము ఒక పవిత్రమైన స్థానము సంతరించుకున్నది. ఇట్టి విశిష్టప్రక్రియ మరేభాషాసాహిత్యమున కానరాదు.

భద్రాద్రిరామాంకితముగా రాధికామనోహరీయ ప్రబంధనిర్మాణమునకు ముందు 1962లో ''రాఘవోత్తమ శతకము'' రచించి స్వామి కర్పించి కావ్యనిర్మాణముగావించి రామచంద్రస్వామి కృపతో పూర్తిగావించి లోకవిదితము గావించినాను. తరువాత'' స్తుతివైజయన్తి'' పేరుతో ౧-౨-౩-౪-౫ భాగాలతో శతకప్రక్రియననుసరించి రచించి ఆయాయిష్టదైవములకు అంకితముగావించి నన్ను నా కవితను సార్థకముగావించుకున్నానని తృప్తినందినాను. నేను రచించిన స్తుతివైజయంతులలో ఒక ప్రత్యేకమైన ప్రక్రియనేర్పరచుకున్నాను. (1) ఇష్టదైవతా ప్రార్థన (2) క్షేత్రదర్శనము (3) క్షేత్రమహిమ (4) మేలుకొలుపు (5) విన్నపము (6) నన్నుతి (7) ఫలశ్రుతి ప్రక్రియలతో శతకవిధులను బోలి ''స్తుతివైజయన్తి'' నిర్విఘ్నముగా సాగి దైవాంకితముగా అలరారుచున్నది.

నాకు హితులు మిత్రులు బంధువులు సహృదయ సుహృత్తములు, సాహితీప్రియ బాంధవులు దైవభక్తి పరాయణులు

సన్మార్గవర్తనులు, బంధుప్రీతిగలవారు. హితస్నేహితులకు హితులైనవారు శ్రీమాన్ సంపన్నమ్రడుంబై మురళీధరాచార్యులు వేణుగోపాలాచార్యులు, మోహనశ్యామాచార్యులు ప్రభృతి సోదరులు మద్విరచితములై స్తుతివైజయంత్యాది కావ్యములను చూచి అలరి నావద్దకు వచ్చి ''మా యిలవేల్పులు ఆరాధ్యులునైన మహబూబునగరమండలమునగల కల్వకుర్తి తాలుకాలోని రఘుపతిపేటకు సమీపమున దుందుభీ నదీతీరమున రామగిరిపై వేంచేసియున్న సీతాలక్ష్మణ హనుమత్సమేత శ్రీరామచంద్రస్వామివారిని గూర్చి ఒక సుప్రభాతము ఒక శతకరాజమును రచించి మా స్వామి కర్పించిన ఆ గ్రంథములను ముద్రించి లోకవిదితము స్వామికృపతో చేయగలమని'' నన్నర్థించి క్షేత్రవిశేషములను నాకందించినారు. వారి అర్థిత్వమును శ్రీసీతారాముల ఆజ్ఞగా భావించి స్వీకరించి ''రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! '' అని ఆలోచింపకుండగా దైవాక్కుగా మకుటము స్ఫురించినందున స్వామికి సాష్టాంగ నమస్కారమాచరించి భాగవతమంగళాశాసనముతో ఆచార్యకృపతో భగవదనుగ్రహముతో ''శ్రీరఘురామశతపారిజాత ప్రబంధము'' అనుకృతిని పెద్దలచే విన్నంతకన్నంత తెలియవచ్చినంత భవతరణోపాయముగా స్వామి రచింపజేయగా రచించి రామగిరిధాముడైన శ్రీరఘురాముని పాదపద్మార్పణముగావించి మాసోదరతుల్యులు భగవద్భక్తులైన శ్రీమాన్ మురళీధర వేణుగోపాలాది సోదరులకు అందించి నన్ను నా కవితను రామార్పణముగావించి ధన్యుడనైతినని తలంచుకున్నాను. ఈ శతపారిజాతప్రబంధకృతితోపాటు స్వామికి ''శ్రీ రాఘవపతి సుప్రభాతమ్'' అను సుప్రభాతకృతిని గీర్వాణభాషలో రచించి స్వామి పాదాబ్జములకు అర్పణముగా శ్రీమాన్ మురళీధర సోదరులకు అందించినాను.

ఈ శతపారిజాతప్రబంధకృతి (1) దైవప్రార్థన (2) క్షేత్రదర్శనము (3) క్షేత్రమహిమ (4) మేలుకొలుపు (5) విన్నపము (6) వినుతి (7) సన్నుతి ఫలశ్రుతి అనంభేదములుగల శీర్షకలతో నున్నవి. ఈ శీర్షికలతో భక్తి ప్రపత్తితో స్వామికి యథోచితమైనవాచికకైంకర్యమును గావించి నన్ను నా కవితాకన్రీని ధన్యముగా వించుకున్నాను.

ఈ కావ్యాధినాయకుడైన రఘురాముని క్షేత్రమైన రామగిరిని గూర్చి కొంత ముచ్చటింపవలసియున్నది.

ఆంధ్రదేశమున అతిప్రాచీన నగరమైన చరిత్రస్థల విశేషములతో తీర్థక్షేత్రవైభవములతో పవిత్రమై యలరారుచు సర్వమతసామరస్యతతో సర్వజాతి సమైక్యతతో అలరారు మహామండలము పాలమూరు మండలము ఇది. మహబూబునగర మహామండలముగా నిత్యవ్యవహారమున ప్రసిద్ధిగాంచియున్నది. ఈ మండలమున చరిత్ర ప్రసిద్ధిగాంచిన తాలూకాలు ఆదర్శతాలూకాలుగానున్నవి. దానిలో వాణిజ్య ప్రసిద్ధిగల తాలూకా కల్వకుర్తి తాలూకా మండలము. ఈమండలమునకు సమీపమున రఘుపతిపేటయను ఉపమండలముగా ఒక గ్రామము కలదు. దానికి అనతిసమీపమున కృష్ణానదికి ఉపనదియైన దుందుభీనది ప్రకృతిసౌందర్యముతో నలరారుచు కన్నులపండువై ప్రవహించుచుండును. వర్షఋతువునందు ఈ నదీవైభవము కన్నులపండువగా హృదయ రంజకముగా నుండును.

అట్టి పవిత్రనదీతీరమున రామగిరియను పుణ్యక్షేత్రము అతి ప్రాచీనచరిత్రను సంతరించుకొనియున్నది. ఈ ఆలయాన్ని పూర్వము గోకర్ణ మహారాజు నిర్మించి రాముని ప్రతిష్ఠింపచేసి నిత్యోత్సవములు మొదలుకొని బ్రహ్మోత్సవముల వరకు ఉత్సవకైంకర్యమునొనర్చి తమ జన్మలను ధన్యము గావించుకొన్నారు.

కాకతీయుల చిహ్నమైన కాకతమ్మ రెండు ఏనుగులమధ్య లక్ష్మీదేవి చిహ్నములు ఈ దేవాలయపు స్తంభములపైయుండుటచే కాకతీయుల కాలమున ఈరామగిరి మందిరము నిర్మింపబడినట్లు తోచుచున్నది.

కాకతీయులపాలనకు పూర్వము రామగిరివద్ద సురభిపట్టణ ముండెడిదని ప్రస్తుతమున్న సురభివంశమువారు చెప్పుచున్నారు. శైవ వైష్ణవుల మధ్య తగవులధికమై వైష్ణవాధిక్యతచే వైష్ణవాలయముగా మారినదని, మొదట శైవక్షేత్రముగానుండెనని చెప్పుదురు. ఏకాలంలో వైష్ణవక్షేత్రముగామారెనో ఇదమిద్ధంగా నిర్ణయించి చెప్పలేము.

సీతారాముల విగ్రహప్రతిష్ఠ గోకర్ణమహారాజుల కాలములోనే జరిగి నిత్యపూజాదికార్యక్రమములు జరుగుచుండెడివి. దైవకైంకర్య నిమిత్తము స్వామివారిపేరున నేటికి యినాముగా ఉన్న భూమి 560 ఎకరాల మెట్టభూమిని ఆ గోకర్ణమహారాజులు దానపూర్వకముగా యిచ్చినట్లు కొన్ని శాసనాలు దాఖలాలద్వారా తెలియుచున్నవి. కొంతకాలమునకు నిజాముల పాలనములలో కొందరు తురుష్కదౌష్ట్యులు దేవాలయమును దోపిడిచేసి, విగ్రహాలను ఒకబావిలో పడవేసినారని ప్రజా యైతిహ్యాము.

కొంతకాలము శిష్యసంచారార్థమైవచ్చిన శ్రీమాన్ ముడుంబై తిరుమలాచార్యులు(మొదటి)గారు తత్రత్యులైన రామిరెడ్డియను గ్రామాధికారి యింటిలో ఉండగా ఒకనాటి రాత్రి స్వప్నమున రామచంద్రస్వామివారు సాక్షాత్కరించి, ఈ సమీపములోని బావిలోనున్నానని, నన్ను వెలికి తీసి తిరిగి రామగిరిపై ప్రతిష్టించి నిత్యారాధనలుగావింపవలెనని చెప్పగా ఆచార్యులుగారు మేల్కొని ఉదయమున రామిరెడ్డిగారికి తన స్వప్నవృత్తాంతముచెప్పి రెడ్డిగారిని వెంబడించుకొని బావివద్దకు వెళ్లి బావిలోని విగ్రహములను వెలికితీయించి, సంప్రోక్షణము పునఃప్రతిష్ఠాధికార్యక్రముల జరిపించి స్వామిని ప్రతిష్ఠింపచేసి నిత్యపూజాదులు జరిపించుటమును ప్రారంభము గావించినారు. వారి ఆధిపత్యములోనే స్వామికిగల భూమిని రెడ్డిగారిద్వారా స్వాధీనము చేసికొని గ్రామపెద్దల అంగీకారముమేరకు దేవాలయమునకు ధర్మకర్తలుగానుండి స్వామికైంకర్యములు మహావైభవముగా జరిపించుచు వచ్చినారు. వారి తరువాతివారందరు వంశపారంపర్యశాశ్వత ధర్మకర్తలుగా దేవాలయ విధినిర్వహణములను స్వామివారికి అర్చనాది కైంకర్యములను గావించుచున్నారు.

మొదటి ధర్మకర్తలు తిరుమలాచార్యులవారి తారువాత కీ.శే. శ్రీమాన్ ముడుంబైకృష్ణమాచార్యులు (!) కీ.శే. శ్రీమాన్ ముడుంబై లక్ష్మణాచార్యులవారు (మొదలువారు) తరువాత (3) కీ.శే. శ్రీమాన్ ముడుంబై తిరుమలచార్యులు (రెండవవారు) (2) కీ.శే. ముడుంబై వేంకటాచార్యులవారు (4) ముడుంబై రాఘవాచార్యులవారు (6) కీ.శే. కృష్ణమాచార్యులవారు (7) కీ.శే.

శ్రీమాన్‌ముడుంబై లక్ష్మణస్వామివారు (రెండవ ఛైర్మన్) (8)...... (9) కీ.శే. ముడుంబై వేంకటరామాచార్యులుగారు (మాజీఛైర్మెన్) ప్రస్తుతమున్నవారు (1) శ్రీమాన్ ముడుంబై లక్ష్మణాచార్యులగారు (2) శ్రీమాన్ లక్ష్మణాచార్యులగారు (3) శ్రీమాన్ ముడుంబై పాండురంగాచార్యులగారు (4) శ్రీమాన్ శ్రీనివాసాచార్యులు కీ.శే. వెంకటరామాచార్యుల గారికుమారులు (5) శ్రీమాన్ మురళీధరాచార్యులు, (6) శ్రీమాన్ వేణుగోపాలాచార్యుల గారు. (7) శ్యామాచార్యులు గారు (8) మోహనాచార్యులు గారు మొదలగు సహోదరులు ప్రస్తుతము ఆలయ ధర్మకర్తలుగానుండి స్వామివారి నిత్యపూజావిధానములను బ్రహ్మోత్సవాది కార్యక్రములను నిర్వహించుచున్నారు. త్రికరణశుద్ధిగా నిష్ఫలాపేక్ష కర్మయోగులై భక్తిప్రపత్తులతో స్వామికి నిత్యకైంకర్యాదివిధులనుగావించుచు స్వామిని సేవించుచున్నారు.

ప్రతి సంవత్సరము పాంచరాత్ర ఆగమోక్తప్రకారముగా మాఘ శుద్ధ ౧౩ రోజున స్వామివారికి కల్యాణోత్సవము అతివైభవముగా జరుగును, నేటి దేశకాలపరిస్థితులనుబట్టి స్వామివారికిగల భూములన్నియు పరాక్రాంతములై యున్నందున ప్రభుత్వమువారు, తత్ప్రాంత ప్రజాప్రతినిధులు, ఇంతటి గొప్పక్షేత్రమునుగూర్చి ఏమియు పట్టించుకొనక మూకీబావముతో ఏవేవో కుంటి సాకులతో కాలమును దాట వేయుచున్నారు. ఇంత విలువైన భూమిని ఆక్రమించుకొన్న భూబకాసురులైన భూకామాందులనుండి భూమిని విడిపించి స్వామికి ఆదాయము పెంచే శక్తిలేదు నేటి ప్రభుత్వమునకు, ప్రభుత్వాధికారులకు ప్రజాప్రతినిధులకు, ఇది మనహైందవధర్మపద్ధతికి మాయనిమచ్చ; హైందవప్రజా ప్రతినిధులమని పేరుపెట్టుకొని తిరిగే నాయకమ్మన్యుల పరిపాలనలతో ప్రాచీనదేవాలయములు ఈనాడు దీపధూపనైవేద్యాలకుకూడా నోచుకొనక శిథిలావస్థకు గురియైనవి, గురియగుచున్నవి దేశభద్రతా క్షీణతకు కారణమగుచున్నవి కూడ దీన్నిబట్టిచూడ నేటిప్రభుత్వాలకంటే నాటి హైందవేతర ప్రభుత్వాలే ధార్మికవిధులకు ప్రాధాన్యమిచ్చి ప్రజాక్షేమమునకు పాల్పడినట్టుగానవచ్చుచున్నది. ''గతకాలముమేలు (నేటి) వచ్చుకాలముకంటెన్'' అను ఆర్యోక్తి అక్షరాల నిజమని తోచుచున్నది.

ఈ రామగిరిదేవాలయము క్షీణదశకు దిగుటను గుర్తించి పరమభక్తులు భగవత్సేవాపరాయణులునైనవారు. దేవాలయ అభివృద్ధికి కంకణం కట్టుకున్నవారు స్థానికులైన బ్రహ్మశ్రీ వేదమూర్తులైన శ్రీ శ్రీ రామేశ్వరశాస్త్రిగారు ధర్మకర్తలతో కలిసి, కొంతమంది భగవద్భక్తులను వెంటబెట్టుకొని రామగిరికి చుట్టుప్రక్కలగల గ్రామస్థుల సహకారంతో బ్రహ్మోత్సవాది కార్యక్రమములను నిర్వహించుచు స్వామివారికైంకర్యానికి తోడ్పడుచు స్వామి అనుగ్రహమునకు పాత్రులై ధన్యజీవులైయున్నారు అగుచున్నారు.

వంశపారంపర్యంగావచ్చుచున్న వంశాధినేతలు ధర్మకర్తలు ముడుంబై రాఘవాచార్యులవారి సంతతివారు క్షేత్రములో జరిగే పూజాకార్యక్రమములను నిర్వహించుచున్నారు. శ్రీమాన్ ముడుంబై మురళీధరాచార్యులు వేణుగోపాలాచార్యులవారు మొదలగు సోదరులు దేవాలయ అభివృద్ధికొరకు అనేకములైన పాటులు పడుచున్నారు. స్వామి ఆజ్ఞగా వేణుగోపాలాచార్యులగారు ఈ స్వామికి శతక కృతి వ్రాసియిమ్మనగా స్వామిదయతో నాశక్తికొలది చంద్రునికోనూలుపోగన్నట్లుగా ఉడుతాభక్తిగా ఈశతపారిజాత ప్రబంధముమను కృతిని సుప్రభాత కృతిని రచించి స్వామి పాదారవిందములలో సమర్పించుకొని నన్ను నా కవితను ధన్యము గావించుకున్నానని సంతసించుచున్నాను.

ఈగ్రంథముద్రణలో పరభక్తులైనవారు ఆచార్యులవారికి తోడ్పడి గ్రంథమును ముద్రించి లోకవిదితము గావించి తాముతరించి యితరులను తరింపజేతురని నావిశ్వాసము.

స్వామి అనుగ్రహముతో పెద్దల ఆశీస్సులబలముతో ఆచార్యులవారి కృపతో భాగవతోత్తముల మంగళాశాసనముతో నానుండి ఈశతపారిజాత ప్రబంధము సుప్రభాతకృతులు వెలువడినవే కాని ఇందు నాప్రయత్నము ఏమిలేదు. నేను నిమిత్తమాత్రునిగానే ఉన్నాను. స్వామికృపతో ఈగ్రంథములు నానుండి వెలువడుట నాపూర్వజన్మసుకృతమని విశేషమని భావించుచున్నాను. ఈకృతులను నానుండి

వెడలింపజేసిన శ్రీ శ్రీ రామగిరి రామచంద్రస్వామి వారికి సాష్టాంగదండ వత్ప్రణామముతో కృతజ్ఞతలనందించుకొనుచున్నాను. ఈగ్రంథమునానుండి వెలువరింపజేయుటకు ప్రేరకులు కారణ భూతులైన భగవద్భక్తులు శ్రీరామగిరిరామచంద్రస్వామివారి కైంకర్యనిరతులు శ్రీమాన్‌ముడుంబై మురళీధరాచార్యులు శ్రీమాన్ వేణుగోపాలాచార్యులు మొదలగు సోదరులకు నాశుభాశీః పురస్సరములైన శుభాభినందనలనందించుకొనుచున్నాను; వారికి వారి సహోదరాది కుటుంబవములకు ఆయురారోగ్యైశ్వర్యములునొసంగి శ్రీరామచంద్రుడు అభ్యుదయమార్గములను నిరాటంకముగా కొనసాగింపజేయవలయునని ఆకాంక్షించుచున్నాను. శ్రీస్వామివారి కైంకర్యములకు బ్రహ్మోత్సవాది కార్యక్రమములను నిరాటంకంగా కొనసాగించుచున్న బ్రహ్మశ్రీ రామేశ్వరశాస్త్రి గార్కి సవినయంగా నమస్సులందించుకొనుచున్నాను.

ఈగ్రంథరాజమును నాకు కన్యాదానమునుజేసి మావంశమున నన్ను కీర్తిప్రతిష్ఠలతో పెంపొందింపజేసిన మహోదారులు ఆచార్యపురుషుడైన మహబూబ్‌నగర్ జిల్లా కల్వకుర్తి తాతాఖా ఎల్లమ్మ రంగాపురవాస్తవ్యులైన కీ.శే. శ్రీమాన్‌మరిజ్గంటి జగన్నాధాచార్యులగారి ద్వితీయ కుమారులు కీ.శే. శ్రీమాన్ మరిజ్గంటి శఠకోపచక్రాచార్యుల మామగారి జ్ఞాపకార్థమముగా దుందుభీనదీ తీరోపాంత రామగిరిమందిర నివాసుండైన చతుర్దశ భువనాధీశ్వరుండైన శ్రీసీతాలక్ష్మణ హనుమత్సమేత శ్రీరామచంద్రస్వామి వారి పాదపద్మములలో సమర్పింపనైనది.

పరమభక్తులైన పాఠకమహాశయులు ''ప్రమారోధీమలామపి'' అన్నట్లు ఏవైనా పొరపాట్లున్న క్షమించి క్షీరనీన్యాయమున వర్తించి నాకునాకవితాశక్తికి ఇతోధికప్రోత్సాహములందింపజేతురని ఆకాంక్షించుచు ఈగ్రంథము సర్వము శ్రీరామగిరి శ్రీరామచంద్రస్వామివారి పాదపద్మములలో చెలువారుగాత! యని ఆశించుచు స్వామివారికి కృతిని సమర్పించి నమస్సుమాంజలులందించుచు సెలవుదీసికొనుచున్నాను.

ఇట్లు

శ్రీవర్భగవద్భాగవతాచార్యాదిచరణ

సరోజవిధేయులు

**నల్లదీగ శ్రీనివాసాచార్యులు ( ఇందిరాల**

సికింద్రాబాద్, మహబూబు కళాశాలా

విశ్రాంత ప్రధానాంధ్రాద్యాపకులు

**హేమంతశిశిరములు** 1997

శ్రీః
శ్రీలక్ష్మీ హయవదన పరబ్రహ్మణే నమః
శ్రీజ్ఞాన సరస్వత్యై నమః
శ్రీ సీతా లక్ష్మణ హనుమత్సమేత
శ్రీరామ చంద్ర పరబ్రహ్మణే నమః
శ్రీ పాలమూర్ (మహబూబ్ నగర్) మహామండలాంతర్గత
-(శ్రీ దుందు భీతీరోపాంత శ్రీరామగిరిధాముడైన)-

# శ్రీరఘురామ స్తుతి వైజయన్తి

శ్రీరామ! రఘురామ! శ్రితజనావన నామ!
సీతా ముఖోల్లాస శ్రీలలామ!
మౌనిమానస హర మారసుందర రామ !
విశ్వమోహన రూపవిభవరామ!
ఆర్తప్రపన్న భవ్యాభయ ప్రదరామ!
కుటిల ధూర్తాసుర కులవిరామ!
శరణాఽగత త్రాణ కరుణాబ్ధి కులసోమ!
వినుత పావన నామ! విజయరామ!
సకల కల్యాణ గుణ గణ స్వాంత రామ!
పురుషమోహన సౌందర్యపూర్ణరామ!
వినుతరఘుపతిపేట సర్వేశరామ!
రామగిరిధామ! శ్రీరఘురామ! రామ! ౧

సీతామహాలక్ష్మి చిత్తాబ్జభానుండు
అర్థికల్పక శాఖియౌఘనుండు
సత్యధర్మాఽహింస శాంత స్వభావుండు
ఖ్యాత సద్గుణుండు సాకేతవిభుడు
సత్కృపారసపూర్ణసౌందర్యనేత్రుండు
మౌని మానిత హితమధుర గుణుడు

సూరి మానస పరమ హంసుడు ఘనుండు
భక్త జన పారిజాతుడు పరమ పురుష-
వర్యు డన నీవె యని నిన్ను భక్తి గొలుతు
రామ గిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౨

మధుర మంజుల భాష ! మౌని మానస తోష !
మాయామనోజ్ఞ సన్మనుజ వేష !
ధర్మవిరోధ దుర్దానవహర రోష
హృతసాధుజనక ృత వితతదోష !
పరమ ప్రసన్న సద్భక్త సంహతి పోష !
సత్య దర్మావన సన్మనీష !
మృదుల సత్కరుణార్ద్ర హృదయనవ్య శిరీష !
రఘుకు లాన్వయ దివ్యరత్నభూష !
విబుధ బుధలోక హృత్పరివేషితోరు-
చరణ యుగ్మైక నీరజాసన విశేష !
జానకీ స్వాంతసంతోష ! సాగిలింతు,
రామ గిరిధామ ! శ్రీరఘురామ ! రామ! 3

సకల సద్గుణనామ ! సాకేతపురధామ !
సౌందర్యసీమ ! కౌసల్యరామ !
దాక్షిణ్యగుణ ధామ ! దశరధ శ్రీరామ !
సద్యశస్తోమ ! అయోధ్యరామ !
దనుజ మర్ధన రామ ! ధర్మతత్పరరామ !
సాధుసన్నుతనామ ! సత్యకామ !
అనవద్యజయరామ! అరివియర్ధనభీమ !
(1) తారకనామ ! భద్రాద్రిరామ !
పరమశుభకర శతకోటి చరితరామ !
జానకీరామ ! రఘువంశజలధి సోమ !
రామ ! నినుగొల్తు రవికుల రమ్యసీమ !
రామగిరిధామ ! శ్రీ రఘురామ ! రామ ! ౪

(1) కారుణ్యరామ ! దుష్టలవిరామ !

ఇక్ష్వాకుకులరామ! ఇనకులాంబుధి సోమ!
కాకుస్థరామ! శ్రీకంఠరామ!
గాధేయ నుత రామ! గౌత మార్చిత రామ!
ఆశ్రిత రామ! అహల్య రామ!
వాశిష్ఠ రామ! కైవల్యద శ్రీరామ!
కలిహర నామ! అగస్త్యరామ!
హనుమ దర్చిత నామ! ఘన బాహుబలరామ!
పావన నామ! సుగ్రీవ రామ!
దివ్య నుతనామ! శబరసతీశ రామ!
త్రిభువనావన కళ్యాణ విభవ రామ!
జానకీ రామ! దయ జూడు జనకరామ!
రామగిరి ధామ! శ్రీ రఘు రామ! రామ! ౫

## ఇష్ట దేవతాదిస్తుతి:-(వేంకటపతి)

శ్రీవేంకటాచల శిఖర భూషణమైన
శ్రిత కల్ప శాఖియై చెలగువాని
అలమేల మంగకు అలుక రానివ్వక
ఘన సుఖమ్ములనిచ్చు కొానెడివాని
పిలిచిన నోయని పలుకుచు భక్తుల
కొంగు బంగారమై కులుకువాని
''భక్తుల కిహ పర ఫలమిచ్చు నివియని
పేర్మి పాదముల జూపించు''వాని
రత్నమౌళియు శంఖ చక్రములు నిల్వు -
నామములు గుల్కు వాని నా స్వామి నెదన
భక్తి నుతియించి మీ కృపన్ వ్రాతు కృతిని
రామగిరి ధామ! శ్రీ రఘురామ! రామ! ౬

(హరి స్వరూపములు)

శ్రీ యాద భూధర శ్రీనారసింహుని
శ్రిత కల్ప భూజుని సేవ్యగుణుని
శ్రీ మంగళాద్రి సర్వేశుడౌ నృహరిని
పానక ప్రియుని నాకైన హితుని
ధీహిత జ్ఞానద శ్రీ హయగ్రీవుని
నిఖిల విద్యాధారు నిగమనుతుని
భద్రాద్రి వాసుడౌ వైకుంఠ ధాముని
దాక్షిణ్య గుణ నిధిన్ ధర్మపరుని
ఇందిరానంద మందిర సుందరునిని
రాజ గోపాల దేవుని రాగ విదుని
రంగశాయిని మది గొల్చి వ్రాతుకృతిని
రామ గిరి ధామ! శ్రీరఘు రామ! రామ! ౭

(శ్రీకంఠాదిదేవతలు)

శ్రీ రౌప్య గిరిహితున్ శ్రీ శైలజాపతిన్
శ్రీకంఠ పతిని శ్రీ శ్రీశనుతుని
చలి మల పట్టి కూర్మల ముద్దు బిడ్డైన
సాధుసన్నుతుని గణాధిపతిని
క్రౌంచాద్రి నొక కోల గదిపిన సురవైరి
భేదిని దేవసేనాధిపతిని
హరి హరపుత్రుడై ధరకీర్తి నెదిగిన
ధర్మ శాస్తైన భూతాధిపతిని
అహిత దక్షాధ్వర ధ్వంసియైన ఘనుని
వీర భద్రాధి పతిని దివ్యేంద్ర బుధుల
పరగ నుతియించి మీ కృపన్ వ్రాతు కృతిని
రామగిరి ధామ! శ్రీరఘురామ! రామ! ౮

(లక్ష్మ్యాది మాతృమూర్తులు)

పాల్కడలి గారాల పసిడి ముద్దుల కూన
పక్కిడాల్వేలుపు పడతిఁ గొలిచి
కొండలరేడైన దండి మంచులకొండ
సామి పట్టిని శివుసాని దలచిఁ
కలుములదొరసాని గారాబుకోడలు
నలువ రాణిని పల్కు వెలదిఁ దలచి
మూడు సందెలలోన మురియుచు వెల్గెడు
ఐశ్వర్యమిడెడు గాయత్రి నలరి
అమ్మలకె యమ్మ ముగ్గురమ్మలకె యమ్మ
యైన సిరిచుట్టుకైదు వు నందువెలయు
సుదతి సిరిదేవి గని కృతిన్ మొదలిడెదను
రామగారి ధామ! శ్రీరఘురామ! రామ! ౬

## -:పరవాసుదేవులు:-

వైకుంఠపురిలోన వంది సంస్తుతిలోన
శ్రీభూమి నీళల చెలిమిలోన
సురగరుడానిల సూరివిష్వక్సేన
శేషాది ,భృత్యుల సేవలోన
సనకస నందన సాధు సంస్తుతిలోన
నారద సామగానాలలోన
వేదా సమేడిత వేద సన్నుతిలోన
నిత్యసూరులపేర్మి నీడలోన
పరమ పంచాయుధమ్ముల ఫణితిలోన
కనక చేలాది శ్రీవత్స కౌస్తుభముల
దీప్తిలో వెల్గు పరవాసుదేవుఁ గొలుతు
రామగిరి ధామ! శ్రీరఘురామ! రామ! ౧౦

ఎవని శ్రీ నయనాలు ఇనశశిరూపాలు
రూపాలనంతాలు వ్యాపకాలు
ఎవని శ్రీ నామాలు నెఱుంగ వేనకువేలు
గణనీయకల్యాణ గుణగణాలు
ఎవని యాకారాలు త్రిభువన దీపాలు
బ్రహ్మాండ రూపాలు బాసురాలు
ఎవని శ్రీమందిరాలింద్రాదిలోకాలు
నిత్యసూరుల కీర్తనేడితాలు
భృత్యపరిచారకాల్విధివిన్నపాలు
తనరు పరవారు దేవుల కనికరాలు
సతము మది గల్గ వ్రాతు నీకృతి పదాలు
రామ గిరిధామ ! శ్రీ రఘురామ ! రామ ! ౧౧

(గురుపరంపర)
శ్రీనాధు డాదిన శ్రీ యామునుడు మధ్య
అస్మదాఽ చార్య పర్యంతమైన
గురు పరంపర నెల్లఽ గూర్మి మన్మది నిల్పి
తత్పదాబ్జశ్రీల దలధరించి
ఆత్మతారకులైన నస్మదీయాప్తుల
పరమసద్గురువుల భక్తి గొలచి
లక్ష్మణ యోగి విలక్షణ శ్రీరామ-
మిశ్రాది గురువుల నాశ్రయించి
నీపదాబ్జాల సిరుల మన్నించి మదిని
కృతిని వెలయింతు బేర్మినీకృపన స్వామి !
దయలగనుమయ్య ! శ్రీఖగేంద్రాధిగామి !
రామగిరిధామ! శ్రీరఘురామ! రామ! ౧౨

(ద్వాదశసూరులు)
శ్రీభూతయోగిని శ్రీసరోయోగిని
మహదాహ్వాయు భట్టమాన్యపతినిన్
శ్రీని శ్రీభక్తిసారుని కులశేఖరున్

ఘనయోగివాహు భక్తాంఘ్రిరేణుం
పరకాలు నలయతీశ్వర రామమిశ్రులన్
మాన్య పరాంకుశ మధురకవుల
మార్యూరునంబిని మాసేన ముదలిని
తిరుమలనంబిని పరమగురుని
పరమ మనవాళమునుల శ్రీ భట్టపతుల
పిళ్లలోకార్యులాది సద్వినుతులైన
పరమ భాగవతుల నెదన్ ప్రస్తుతింతు
రామగిరి ధామ! శ్రీరఘురామ! రామ! ౧౩

(ఆచార్యులు - పరమాచార్యులు)

అజ్ఞానముల బాపి విజ్ఞానముల జూసి
ఆదుకున్నట్టి స్వాచార్యవరుల
భవతారకమ్మైన వరతిరుమంత్రమున్
తెలిపిన పరమశ్రీదేశికులను
కనిపెంచి పెద్దజేసిన తల్లి దండ్రుల
ధర్మతత్పరుల పాదాబ్జములను
పరమ ప్రసన్నులౌ భక్తాగ్రగణ్యుల
నుత్తమభాగవతోత్తములను
భక్తిమీరగ వైరాగ్యభావమమర
సంస్తుతించుచు మిగుల సాష్టాంగపడుచు
కృతిని వ్రాసెద (బల్కెద) నీ కృపా స్థితులు గల్గ
రామగిరి ధామ! శ్రీ రఘురామ! రామ! ౧౪

(ప్రాచీన సంస్కృతాంధ్రకవులు)

ప్రాచేతస పరాశరాగమ వ్యాసులు
అమరవాక్కవితాద్యులైన కవులు
భాస సత్కవికాళిదాస శ్రీభవభూతి
బాణాదిగీర్వాణ వాక్సుకవులు
ఘనులు నన్నయ్య తిక్కన యజ్వ యెఱ్ఱనల్

ఆంధ్రవాక్పవితాద్యులైన కవులు
సోమన నాచనసోమన శ్రీనాథ
స్వాదూక్తి శ్రీపోతనాది కవులు
పరమ నవరస (1) ముఖ్యానువాదకవులు
అష్ట దిగ్గజ కవులు విశిష్టకవులు
వరల నెదలోన నతిజేసి వ్రాతు కృతిని
రామగిరి ధామ! శ్రీరఘు రామ! రామ! ౧౫

సారస్వత శ్రీల సాక్షాత్కృతిన్ గన్న
ఘనులైన శ్రీమరిజంటికవులు
బ్రాహ్మీమయస్ఫూర్తి భాసిల్ల వెలిగిన
విశ్వనాథా ది సద్విజ్ఞకవులు
ఉభయబాషాయోషనోలలాడించిన
పుట్టపర్తి విశిష్ట పూజ్యకవులు

మాధుర్య ధుర్యమౌ మాన్య కావ్య శ్రీల
నలరు జంధ్యాల ఉత్పల సుకవులు
రసమయోజ్జ్వల కవితా శరధులునైన
దాశరథి వానమామలాదర్శకవులు
మదిని జెలువార మీ కృపల్ మసల వ్రాతు
రామగిరిధామ! కృతిని శ్రీరామ! రామ! ౧౬

(ఓరామ! నీవే పలుకునిడుము)

నీ నామ జపతపోనియమాదులన్ గల్గి
మీ కథన్ వ్రాయు వాల్మీకిఁ గాను
కాళీకృపన్ గల్గి కవియయ్యి నిప్పాడి
ధరణి వెల్గిన కాళిదాసు గాను
నీ దివ్య మానస ని జకథన్ బల్కిన
సూరియౌతులసిదాసుండ గాను

(1) ముఖ్య ప్రబంధ కవులు

నిన్ను సద్భక్తితో నెఱ నమ్మి గొలిచిన
        భవభూతి భాసాది కవులగాను
బాణ శ్రీభర్తృహరులాది పరమ కవుల
గాను తత్పదధూళిని గానె కాను
పలుకు దేతీరు? నతిజేతు పలుకు నిడుము
రామగిరిధామ! శ్రీరఘురామ! రామ! ౧౭

భారతామ్నాయ దీవ్య ద్రామ చరితమున్
        పలికిన నెఱ్ఱనార్యులను గాను
మందారమకరంద మధురమౌ భాగవ -
        తమును మీ కిడిన పోతనను గాను
రాణింప ద్విపదలో రామాయణముఁవ్రాసి
        స్తుతిగన్న రంగనాథుండ గాను
రమ్యమౌనుత్తరరామాయణము జెప్పి
        ఘనుడైన కంకంటి కవిని గాను
పేర్మిరామాయణోత్కల్ప వృక్షమవని
నమరనిల్పిన శ్రీవిశ్వనాథు గాను
పొననిన్బల్క దపియింతు నాదుకొనవె!
రామ గిరిధామ! శ్రీరఘురామ! రామ! ౧౮

శాస్త్రజ్ఞుడను గాను సద్వివేకిని గాను
        వినుత మాధుర్య వాగ్విదుడ గాను
పూర్ణభాషా పర భోగివర్యుడ గాను
        కవితా విశేష భాస్కరుడ గాను
నవరసా లంకార నైపుణ్యుడను గాను
        కావ్యప్రకాశ సంభావ్యు గాను
ఘనతర కావ్య సధ్వనివైభవుడ గాను
        రమణీయ శబ్దార్థ రమణు గాను
కావ్య మీమాంసలను జేయు ఘను డగాను
మీపదాబ్జంబులన్ మది నిలిపి కోరి
పలుకువాడను కరుణించి పలుకొసంగు
రామగిరిధామ! శ్రీరఘురామ! రామ! ౧౯

శ్రేయోభిలాషులు శ్రీవరదార్యులు
యాదగిరిస్వామి యాప్తవరులు
పదబంధ నైపుణ్యపటిమలో ఘనులు నా
విహితులు వరదార్య విబుధకవులు
మాతులుల్ శ్వశురులు మాన్యులు శ్యాలకుల్
శ్రీజగన్నాథాదిశీలమతులు
మామకాభ్యున్నతిన్ మది గోరు సోదరుల్
సోదరీమణులు మిత్రాది హితులు
దుహిత జామాత దౌహిత్ర విహితు లాది
బంధు జనులెల్ల మన్మదిన్ భాసిలంగ
దలచి మీకృప! పలికింప పలుకుదయ్య
రామగిరిధామ! శ్రీరఘురామ! రామ! ౨౦

సంపన్మ్మడుంబ వంశాంబోధి చంద్రులౌ
వేంకట రామార్య విబుధ వరుల
అనుగుణ సౌశీల్యలాండాళుజననికి
గర్భశౌక్తికపుముక్తాఫలాలు
పరమహితా ప్తులు బాంధవ ప్రీతులు
శ్రీభాగవతనిష్ఠ చెలగువారు
హితులకు మేటి స్నేహితులకు విహితులు
మురళీధరాది సోదరులు ఘనులు
మీ పదశ్రీల మదినమ్మి మెలగువారు
వారి రూపాన మీ కృపల్ చేరి నన్ను
ఆజ్ఞనిడె వ్రాయు కృతినని; ఆఢ్యుడనుర!
రామగిరి ధామ! శ్రీరఘురామ! రామ! ౨౧

నిరుపేద కనుకోని సిరులు గల్గినయట్లు
ఆడబోయిన తీర్థ మందినట్లు

అన్నార్తునకు పరమాన్న మబ్బిన యట్లు
పోయిన వస్తువు పొందినట్లు
విరహిణీ కాంతకు విభుసమాగమయట్లు
(1) మండువేసవునికి మఱియట్లు
అంధునకు నేత్రదాతచే ననువుమెఱయ
కండ్లు గలిగిన యట్లు నీ కరుణ లెల్ల
నండ నిడినావు స్వామి! ధన్యుండరామ!
రామగిరిధామ! శ్రీరఘురామ! రామ! ౨౨

ఆదిశేషుని పల్కుకందవీవట! గదా!
నినుబల్కబూన నేనెంతవాడ
సురరాజు కండ్లైన జూడలేవట! గదా!
నిన్ జూడ నెంచ నేనెంతవాడ!
సుర గురు వర్యుని స్తుతి క్షందవట గదా!
నిన్ స్తుతిజేయ నేనెంతవాడ!
పరమ భక్తుల భక్తి పట్టలేదట గదా!
నిను భక్తి బట్ట నేనెంతవాడ!
సాధు సద్యోగముల కంద జాలవంట!
స్వామి! నిన్నెట్లు నేనందంజాలుదయ్య!
నన్ను గరుణించినన్ నిన్ను నందజూతు
రామగిరిధామ! శ్రీరఘురామ! రామ! ౨౩

వాల్మీకి ప్రభృతి గీర్వాణ వాఙ్మయకవుల్
నిన్నాడి ధన్యులై నెగడినారు
శ్రీతులసీదాస ఖ్యాత హిందీకవుల్
నిన్వేడి చరితలో నిలిచినారు

(1) మండు వేసవిన పెన్మట్టి యట్లు

కంబడు మొదలు ప్రఖ్యాత ద్రావిడ కవుల్
నిన్గొల్చి సత్కీర్తి నెన్నినారు.
భాస్కరకంకంటి బమ్మెర పోతనా
ద్యాంధ్రసత్కవులు నిన్ దాల్మిగనిరి
మొల్ల మొదలగు కవయిత్రులెల్ల మిమ్ము
కూరిమిన నెంచి తరియించినారటయ్య!
నీదు కృతి వ్రాసి తరియింతు నెనరుజూపు
రామగిరిధామ! శ్రీరఘురామ! రామ! ౨౪

ఏ పూర్వ పుణ్యమోయెదుగ త్యాగయగారు
వాగ్గేయకారుడై వసుధ వెలిగె
ఏ జన్మ సుకృతమో యెదుగ గోపన్ననిన్
దగ గొల్చి (1) శ్రీరామదాసుడయ్యె
ఏ తొలిపూజలో ఎదుగ పోతన మీకు
కృతి నిచ్చి కవులలో కీర్తి బెంచె
ఏ వ్రతంబులు పండ శ్రీవిశ్వనాథస
త్కవి కల్పవృక్షమై ఘనత గాంచె
జన్మ జన్మాల యోగముల్ సాగి యెదుగ
భవము దాటిరి యెందరో భక్తు లవని,
నేను రిక్తుడ నిను గొల్తు నెనరు జూపు
రామగిరిధామ! శ్రీరఘురామ! రామ! ౨౫

## క్షేత్రదశర్శని

శ్రీ సంపదల తెల్గు సిరి కిరువది యొక్క-
టైన బంగారు బిడ్డలను గంటి,
పసిడి మేల్నునుపొంపు మసలెడు తెలగాణ
సీమ పుట్టిల్లని చెలిమి గంటి

(1) నీ నామ దాసుడయ్యె

మాయమ్మ నలగొండ మాతకు తోడున్న
పాలమూర్మండల శ్రీల గంటి
అందందమైన రూపంది వెల్గొందిన
శ్రీకల్వకుర్తి సచ్ఛీమ గంటి
తనరు రఘుపతి పేటను తాల్మిగంటి
చేరువన వెల్గు దుందు భీతీర మందు
అందమౌ రామగిరిన మిమ్మరయ గంటి
రామగారి ధామ! శ్రీరఘురామ! రామ!

౧

దేశాన్య దేశాలలో శర్వరీ దీప-
కుల తెల్గు చందమామలను గంటి
భారతోర్వర మాతృభాగ్యాల బండించు
తెలుగు రైతన్నల తీరు గంటి
ఆంధ్ర మాతృశ్రీకి నందాల బిడ్డలౌ
కార్మిక శ్రామిక ఘనుల గంటి
పలు తెల్గు దనములు పరుచుకున్నట్టి మే
లైతెలఁగాణ సిరి లచ్చి తీరు గంటి
ప్రాచీన చరితకు భాగ్యమై వెలసిన
పాలమూర్మండల శ్రీల గంటి
పలుతీరులైన వ్యాపారలక్ష్మలు గూడు-
కొని యాడుకొను కల్వకుర్తి గంటి
మెట్ట మాగాణుల మేలైన పంటల
భూభాగ్య లక్ష్మలు మురియ గంటి
సజ్జ జొన్నలు కొఱ్ఱ చామలు త్రైదలు
వరి పంట మొదలగు సిరులఁ గంటి
జామ, దానిమ్మ; మామిడి-జాన-రేగు-
చితుపలపు పండ్లు మొదలగు చెలువమలరు-

పండ్ల సిరులన్ని పారాడ బరగ గంటి
నేరడులు మేడి మొల్మ్టలు నిమ్మ చింత-
మఱ్ఱి వేపలు జిట్రేత మద్ది తాడి(టి)
మాకు మానులు మొదలగు మహితమైన
అడవు లెద గాడ గంటి; నిన్నమరి వెల్గ
రామగిరి గంటి శ్రీరఘురామ! రామ! ౨-3

సిరులమ్మ సొగసులు చెలు వొందు వ్యాపార
పేటియౌ రఘుపతి పేట గంటి
వర్ణా శ్రమముల సంపదలొప్పి సమతతో
నలరెడు పౌర జ నాల గంటి
ననవిల్తు దొరలైన నవయువకులలోని
సోర కోడెతనాల సౌరు గంటి
విరిసింత విరియని మురువూరు మొగ్గ సౌ
రలరిన నును మద్ద రాంధ్ర గంటి
బంతి పూలరథాలు పలు సొంపుతో సాగు
రాగరాసుల జవరాంధ్ర గంటి
ముక్కోటి వేల్పుల ముదితలు చెలువొంది
కొలువైన ముత్తైదువులను గంటి
మమతకు మంచికి మారుపేర్లగు చున్న
మాన్యుల పెద్దల మనుసు గంటి
ప్రజల బాగోగుల పట్టించుకొని చూచు
సత్ప్రజా పాలక జనుల గంటి
ధర్మ నిరతుల సద్వి జోత్తముల గంటి
పరమధార్మికులౌ క్షాత్రపరులగంటి
శ్రామికోత్తమ కర్షక జనుల గంటి
చతుర వర్తక రత వణి క్జనలం గంటి

సాధు సద్భక్త విబుధ సజ్జనుల గంటి
దుందుభీ తీరమున వెల్గి యందమరల
మురియు మీరున్న శ్రీరామగిరిని గంటి;
రామగిరి ధామ! శ్రీరఘు రామ! రామ! ౪-ఇ

పలు సోయగాల వింతలు వింతలన్ గుల్కు-
కాంతార లక్ష్మల కలిమి గంటి
చిత్ర విచిత్రమౌ సిరులొల్కు నును లేత
ప్రకృతికౌపులకింత వలపు గంటి
ఒయ్యారముల సొంపు సయ్యాటలాడ బల్
దూగాడి పారు దుందుభిని గంటి
భూదేవికైన సొంపుల గుల్కుకుచగిరి
వరముగా శ్రీరామ గిరిని గంటి
అందు మీ మందిరపు సిరు లంద గంటి
తావ కార్చక ధర్మ కర్తలను గంటి
మిమ్ము బొడ గంటి మీ పదాబ్జముల గంటి
రామగిరి ధామ! శ్రీరఘు రామ! రామ! ౬

భవదంఘ్రి కైంకర్య పరులు రామేశ్వర
శాస్త్రి మొదలగు సజ్జనుల గంటి
తావక భక్తులు ధర్మకర్తలు నైన
వైష్ణవాచార్యులన్ భక్తి గంటి
భవదర్చకాచార్య పాచక పరిచర్య
దాసుల నతుడనై తాల్మి గంటి
త్వన్మ హోన్నత బ్రహ్మోత్సవముల నెల్ల
భక్తి మీరగ మనసార బరగ గంటి
స్వామి! రక్షింపుమంటి నిన్ శరణ మంటి
రామగిరి ధామ! శ్రీరఘు రామ! రామ! ౭

రామ! మీ మృదు పద రాజీవముల గంటి
ముదమొంది మిముభక్తి మ్రొక్కుకుంటి
కార్తీక పున్నమింగల చందురున్ బోలు
ముసినవ్వులొల్కు మీ మోముగంటి
ధర్మవిరోధులౌ (1) దైత్యులన్ బరిమార్చు
విల్లమ్ములున్న నిన్ వేడ్కగంటి
ఆంజనేయులు మీ పదాబ్జాల నంటి
విమల సద్భక్తి మిమ్ము సేవింప గంటి
చేరి శరణంటి నన్ను రక్షింపు మంటి
కలుష భవబంధ మూడ్చినన్ గావుమంటి;
రామ గిరి ధామ! శ్రీరఘురామ! రామ! ౮

ఇహపరసౌఖ్యాల నెదగించి భవభీతి
సమయించు మీ పదాబ్జాలగంటి
అరి గజనికరాలు నణగలంఘించెడు
పులివంటి మీ పిక్కబలముగంటి
కడు బలిష్టంబైన పిడికెడు నడుములో
తనరు సింహేంద్ర మధ్యంబు గంటి
శ్రీవత్సకౌస్తుభ శ్రీవిశాలము లొప్పు
లలితమౌ బవదురస్థలము గంటి
మోవి ముసినవ్వు పూల సొంపులను గంటి
కరుణ లీనెడు నయనాబ్జ గరిమ గంటి
మోము చంద్రుని గంటి నిన్ మ్రొక్కుకుంటి
రామగిరి ధామ! శ్రీరఘురామ! రామ! ౯

(1) దైత్యాత్ములన్ గూల్చు

పరమ దయాళువీవని నమ్మికొని యుంటి
చేరిన హితుల రక్షింతువంటి
షడ్వర్గ రిపులను సమయింప వలెనంటి
నీషణ త్రయమునింకింపుమంటి
నీ దేహలంకలో పాదౌ నహంకార
రావణున్ బరిమార్చి కావుమంటి
సుఖ దుఃఖముల పెను సుడి గాలి చెలరేగ
పెంపౌ భవాబ్ధి దాటింపుమంటి
నిన్ను దప్పన్యులను మది నెఱుగకుంటి
ప్రీతి ని న్గొల్చు భృత్యుల భృత్యు నంటి
శరణమని చేరితంటి నన్ సాకుమంటి
రామ గిరి ధామ! శ్రీరఘు రామ! రామ! ౧౦

- :: ఇతి శమ్ :: -

శ్రీ వాగీశ్వర్యై నమః　　　　శ్రీ హయగ్రీవాయ న

-: శ్రీరామగిరి - శ్రీరఘురామ శతపారిజాతప్రబంధము: -

## -: శ్రీ రామగిరిరఘురామక్షేత్రప్రశస్తి తృతీయ గుచ్ఛము: -

శ్రీ మన్మనోజ్ఞమౌ చెలు వొందు భారత
　　శ్రీమాతృమూర్తికి శ్రీసుగుణాంలు
అపురూపమైనట్టి యందాలబరిణలౌ
　　ముద్ద బంగారాల ముద్దు సుతలు;
అందాలు చిందాడు సుందార ముద్దలౌ
　　వానిలో నైదుగురైన సుతలు;
వారిలో ముమ్మూర్తులై రమ్యమైవెల్గు
　　తెలుగుందనమ్మున మెలుగు సుతలు
అందు తెలంగాణ సిరి చెలువంద;నందు
మంజులంబైన పాలమూర్మండలమున;
వెలుగు రఘుపతి పుర దుందుభీ సమీప -
రామగిరి దామ! శ్రీరఘురామ! నతులు　　౧

అల తీర ప్రాంత - రాయలసీమ - తెలగాణ -
　　భూాలక్ష్మ లవని బెంపొంది మిగుల
ఆంధ్ర మాతృశ్రీకి నపురూప మురిపాల
　　బిడ్డలై కీర్తిలో దొడ్డలైరి
వానిలో తెలగాణ వరలక్ష్మికెదిగిన
　　పాల మూర్మండల భాగ్యలక్ష్మి
ఆమె కెదిగిన మేటి యందాల సుతులలో
　　కీర్తిత గుణి కల్వకుర్తి లక్ష్మి
ఆమె సుతులందు మేటి రత్నాల పేట
మహిత రఘుపతి పేట; తన్మానితోరు
దుందు భీవాహినీ సేవ్య! స్తుతి నొనర్తు
రామగిరి ధామ ! శ్రీ రఘు రామ ! రామ!　　౨

భోగ్య సంస్థానాల భాగ్యలక్ష్ముల తోడ
బాగుగా వెలిగిన పాలమూరు
ప్రాచీన చరితకు ప్రాచుర్యమైనదే -
వాలయా ల్వ్రిసిన పాలమూరు
పావన శ్రీలిడు దేవమాతృకలున్న
పాడి పంటలవెల్గు పాలమూరు
దేశ హితంకరుల్ తెలివైన పాలకుల్
పండిత కవులున్న పాలమూరు
ఆ మనోజ్ఞపు పాలమూర్మండలమున
మేటి సిరితోట రఘుపతి పేట చెంత
దుందు భీనది కొల్వ నిన్ స్తుతి యొనర్తు
రామ గరి ధామ! శ్రీ రఘు రామ! రామ ! 3

పలుకు తీయని తేట పంట పండిన చోటు
తెలుగుందనంబు పెంపలరు చోటు
తెలుగు మేల్నుడి కారముల మురువ్వగల చోటు
అచ్చు తెన్గుల తేనె జాలు చోటు
తేట తెన్గుదనమ్ము నీటు జాటెడి చోటు
తెలుగు వెన్నెల సిరుల్ వెలుగు చోటు
మురువు తెల్గుదనమ్ము మురిసియాడెడి చోటు
కొమరుతెల్గుదనమ్ముకులుకు చోటు
చేవ తెలుగున్న తెలగాణ సీమ నీటు
అందు మహబూబు నగరు నిమ్మరసి చాటు
దుందుభీతీరపురవాస వందనమ్ము!
రామ గిరిధామ! శ్రీరఘురామ! రామ! ४

తెలుగు పల్కుల జిల్గు వెలుగు సొంపుల బాట
సరసమౌ పలుకు యాసలకు మూట
ముద్ద బంగారంపు ముద్దు పల్కుల బాట
మిన్న తెల్గుల చెన్ను లున్న పేట
తిరమైన తెగువల సిరికి పెట్టని కోట
మాయని యీనిచే మసలు పేట
సొరకోడె తనాల సొంపు లొల్కెడి బాట
ముద్ద మందార పూ బోంట్ల తోట
పాల మూర్మండలాన పెంపైన పేట
నెగడు రఘుపతి పేట, తన్నికటవర్తి
దుందుభీనది నిల్గొల్వ స్తుతి నొనర్తు
రామగిరి ధామ ! శ్రీ రఘు రామ ! రామ ! ౫

అభినవ కృష్ణ రాయలు సోమ భూపాలు
బహు యశ శ్రీల గద్వాల సీమ
త్యాగ దయా ధర్మ దాతృత్వములగన్న
పతులు నెర్గిన వనపర్తి సీమ
సకల సజ్జనులను సామరస్యత నేలు
ప్రోడ రేడుల జటప్రోలు సీమ
తొలి జంట కవుల బాసల నొంచు కవికుల
ధీరు లేచిన యాత్మకూరు సీమ
ఇట్టి సీమలె కావు యింకెన్ని యెన్నొ
వెలుగు శ్రీపాలమూర్సీమ వెలుగు లందు
తనరు రఘుపతి పేటలో ఘనత గాంచు
రామగిరి ధామ! శ్రీ రఘురామ! నతులు ౬

ప్రాచీన వైభవా ర్వాచీన వైభవ
చరిత కాలముల సత్ప్రఖ్యతలరి
మహిత రాజన్యుల మహిత పాలనముల
ఘనయశశ్రీల సంఘటనలలరి
వెను చోళ కాకతి విజయ నాగర నృపుల్
మ్లేచ్ఛాది పుల్ గొల్వ లీల వెలిగి
ఆంధ్ర మాతృశ్రీకి ననుగు ముద్దుల పట్టి
తెలంగాణ సిరి లచ్చి చెలిమినలరి
(1) షాదు నగరాదు లైన నేకాదశాది
మండలోజ్జ్వల మహబూబు మండలమున
తనరు రఘుపతి పేట తద్వినుతమైన
రామగిరి ధామ! శ్రీ రఘురామ! రామ! ౭

గోల్కొండ వజ్రాల కొనురు వెల్గిన నేల
అగ్ని కీలల వెల్గు రాతి నేల
గాజు పరిశ్రమ కనువైన నిలువైన
రమ్యమౌ పలువలరాతి నేల
అమరాద్రి- పెంట పల్యాది ప్రదేశాల
వేలపై వెలయు వజ్రాల నేల
భీమ కృష్ణానదుల్ పేర్మిసాగెడునేల
సాల రసాలభూజముల నేల
పాడి పంటల కిరవైన పసిడి నేల
పాల మూర్మండలపు నేల పాటిచాల
అందు రఘుపతి పేట నిన్నలరికొల్చు
రామగిరిధామ! శ్రీరఘురామ! రామ! ౮

(1) షహద్

పలువేస బాసల పలుకుబళ్లకు దాపు
పలుతీరులౌ మతంబులకు ప్రాపు
వివిధ సంసేవ్య వైభవ తీర్థముల తావు
దర్శనీయముల క్షేత్రాల ప్రోవు
బహువన పర్వత పంక్తులొదవిన భూమి
బహునదీనదములు పారుభూమి
గరక నేలలకు రేగడి నేలలకు తోడు
బహుళ కృషీతరీ పంట గూడు
ఘన పరిశ్రమ వాణిద్య గరిమ కిరవు
పాలమూర్మండలాన పెంపలరు కల్వ-
కుర్తి రఘుపతి పేట నిన్గొలువ వెలుగు
రామగిరిధామ ! శ్రీరఘురామ! రామ! ౬

ఆంధ్ర భాషాయోషననఘఛందో నిధిన్
పెంచిన యప్పకవీంద్ర బుధుడు
తగుని రోష్యమున నుత్తర రామకథదెల్పె
పురుషకార్యేషయ్య పూజ్యుసు కవి
ఘనుడుకేశవపంతులనఘుడౌ శ్రీఖండ
వల్లి నృసింహసద్విబుధవరులు
రెడ్డిరాడ్వల్లపు రెడ్డి బుచ్చారెడ్డి
కవి విమర్శకుడు విఖ్యాతబుధుడు
కీర్తనీయుడుబూర్గులకృష్ణరాయ!
కపిల నాయ్ లింగమూర్త్యాది కవి విబుధులు
మాన్యులెదగిన పాలమూర్మండలమున
తనరు రఘుపతి పేట సద్వినుత రామ!

రామగిరిధామ! శ్రీరఘురామ! రామ! ౧౦

బూర్గుల; సురవరా నర్గళ శేముషీ
వైభవుల్ రాజకీయాభిమతులు
పరమార్థ నిధుల సత్సరసాభ్యుదయముల
సద్భావముల వెల్గు చతురమతులు
దేశ విదేశ సద్వినుతులు వ్యాపార
దక్షులు కర్షకోత్తములు ఘనులు
శ్రామిక కార్మిక సాంఘికోత్తంసులు
ఆర్షవిజ్ఞాన సంభావ్య మతులు
నేతి వృత్తుల పాండిత్య శీలమతులు
దండిగా వెల్గు పాలమూర్మండలాన
చెలగు రఘుపతి పేట నిన్గొలువ దనరు
రామ గిరిధామ! శ్రీరఘురామ! రామ! ౧౧

ఘనతరాచ్చంపేట వినుతయలంపూరు
మక్తల్ కొడంగల్లు మానితములు
ఘనమైన నాగరు కర్నూలు విహితమౌ
శ్రీషాదు నగరు సంసేవ్యములును
కొనియాడదగు నాత్మకూరు సంస్థానంబు
దీపించు సిరుల కొల్లాపురంబు
సకల సద్వ్యాపార సాంద్ర వైభవ వర్తి
గద్వాల వనపర్తి కల్వకుర్తి
ఈ మనోజ్ఞంపు నగరాలకెల్ల నెలవు
మహిత మహబూబునగరాన విహితచరిత
అందు రఘుపతి పేట మిమ్మంటి వెలుగు

రామ గిరిధామ! శ్రీరఘురామ! రామ! ౧౨

సాలముల్-నీప-రసాలముల్-తుమ్మలు
మద్ది-టేక్చింతలు-మామిడులును
మొఱ్ఱి-యిప్పలు-తున్కి-మఱ్ఱి-రేగులు-తాటి-
ఈత-జిట్రేత-జన్నిత చెట్లు
వెదురు, కానుగు పెద్దవెలగలు మారేళ్ల
మేడి, నేరెడు బ్రహ్మమేడిచెట్లు
గన్నేరు-వావిలి-గున్నమొల్లలు-కొండ
గోగులు-గురివింద-కొండమల్లె
సీమ తంగేళ్లు-తంగేళ్లు-జెలగు-నడవి
కలిమి గలపాల మూరున కల్వకుర్తి
బరగు రఘుపతి పేట సంభావ్యమాన -
రామ గిరిధామ! శ్రీరఘురామ! నతులు ౧౩

జొన్నలు పెనుమొక్కజొన్నలు సజ్జలు
కొఱ్ఱలు రాగులు గోధుమలును
సెనగ-లవిసెలు వేరు సెనగలు-గందులు
తైదలులవలు-నాముదములు-పెసలు
మినుములు-బొబ్బర్లు-ననుములు-నువ్వులు
ఆవాలు-మెంతి-ధన్యాలు-పసుపు
పలుతీరు లౌమేటి వరిధాన్యములు నాది
మేలైన కాయ ధాన్యాలు గలిగి
పాడిపంటలతోడ సెంపౌచు మీరు
పాల మూర్మండలమ్మున భాసమాన
మహిత రఘుపతి పేట సమ్మాన్యరాము!

రామగిరి ధామ! శ్రీరఘురామ! నతులు ౧౪

లావణ్యనిధులైన లలిత సత్కళల కో-
మలకుటీర పరిశ్రమాలు వెలుగ
పాడిపంటల వైభవములు పెంపొందంగ
పలుతీరు వ్యాపార ఫణంతు లెదుగ
శ్రామిక కర్షకుల్ సాధు వృత్తులవారు
స్వాతంత్ర్య జీవులై సాగుచుండ
వ్యాపార సరణిలో వర్ధిల్లుచున్న స
ద్వి ఫణంలు సిరులతో వెలుగుచుండ
దండిగా వెల్గు పాలమురుమండలాన
కొమరుమీరెడు శ్రీకల్వ కుర్తిలోన
తనరు రఘుపతిపేట ప్రాంతమున వెల్గు
రామ గిరిధామ! శ్రీరఘురామ! రామ! ౧౫

అల మరిజ్గంటి కోనలకు చెందిననేటి
కవివరుల్ గల్గు రంగాపురమ్ము
ప్రాచీన తనమైన శ్రీచెన్నకేశవ
ఘనవైభవంపు గంగాపురమ్ము
శ్రీకిడాంబి దరూరి సేవ్యులౌ బుధులున్న
మహితమొంగూరు సన్మండలమ్ము
పరమ ధర్మాత్ములు భక్తులు కవి బుధుల్
భాసిల్లు సీమయౌ బాదెపల్లి
మొదలుగా గల ప్రఖ్యాత పురములమరి
వెలుగు శ్రీకల్వకుర్తిన చెలువ మలరు
వినుత రఘుపతి పేట నిన్ దనరి వెలుగు

రామగిరిధామ! శ్రీరఘురామ! రామ! ౧౬

సస్య సుశ్యామల సౌభాగ్యముల వెల్గ
        సకల సద్విద్యా పారసఖ్య తలరి
ప్రాపురమ్మని సిరుల్ కాపురమ్మై యుండు
        శ్రీయష్టలక్ష్మల చెలువ మమరి
శ్రామిక కర్షక సాధు వృత్తుల వారి
        శ్రమ సస్య లక్ష్మల కొమరు లలరి
పండిత పామర ప్రస్తుతిన్ గొను కళల్
        జనపద సాహిత్య ఘనత లలరి
మమత సమతలు స్నేహ సన్మానవతలు
పేర్మి వెలిగెడు రఘుపతి పేట చెంత
దుందుభీ వాహినీ సేవ్య! వందనములు
రామగిరిధామ! శ్రీరఘురామ! రామ! ౧౭

భిన్న వర్ణస్నేహ మున్న చిత్తరువట్లు
        బిన్న వర్ణస్నేహ విధులు పొసగ
తమ కుల వృత్తుల దమకము లెదగాడ
        సేవించు కులవృత్తి శీలు రెదగ;
సుమనస మనసులౌ సుమసులైన భూ
        సుమనసొ ద్వ్యరు వర్ణ సమత లెదగ
జగమెఱిగిన మేటి జగమెఱుంగుల సొంపు
        జిగిగల నవ యువ జగతి యెసగ
మదను ముదమైన తూపుల సదనులైన
ముదము నుసిగొల్పు మమతల ముదిత లెసగ
తనరు రఘుపతి పేట సేవనల వెలుగు-
రామగిరిధామ! శ్రీరఘురామ! రామ! ౧౮

ఈ రఘుపతి పేట యిహ పరతారకం
బగు భవ్య సాకేత నగరు గాగ
ఈ దుందుభీనది యెనలేని పుణ్యాసం
పదలు గల సరయూనదియుగాగ
ఈ గిరి రాజమ్ము భోగభాగ్యా లొప్పు
భద్రమౌ చిత్ర కూటాద్రి గాగ
ఈ గిరి సీమ నందారు సజ్జనులున్న
శ్రేష్ఠమౌ కోసల సీమ గాగ
ఈ మనోజ్ఞపు మందిరం బిద్ధరిత్రి
నమర వెల్గిన వైకుంఠ నగరు గాగ
రాజిలితి రిందు వైకుంఠ రాముడవయి
రామ గిరిధామ! శ్రీరఘురామ! రామ! ౧౯

ఎందెందు జూచిన నందందు సౌందర్య-
సందోహ ప్రకృతి సన్మందిరాలు
ఎంతెంత దవ్వుల నే కోనలన్ జూడ
ప్రకృతి సంపచ్ఛ్రీలు పరుగులాడు
ఏతావులున్ గన నాతావు లన్నియు
సస్యసుశ్యామల శాద్వలములు
ఏ దీవులన్ గన నాదీవు లందున్న
వనదేవతల పరువంపు పాట
ఎప్పుడెప్పుడు గనుగొన్న నప్పుడపటి
నవ్య లక్ష్ములు నీ నాను వైభవముల
అలపించెడి మధుర గానాల సొగసె;
రామగిరిధామ! శ్రీరఘురామ! రామ! ౨౦

ఈ రఘుపతి పేట శ్రీవికుంఠపురమ్మొ
        పరవాసుదేవుడ వనగ నీవె
శ్రీ భూమి నీళలు సీతాస్వరూపాలె
        సౌమిత్రి శేషాహి చక్రవర్తి
ఉరుశంఖ చక్రముల్ భరత శత్రుఘ్నులు
        పెరియ సిరియాళ్వార్లు గరుడ కపులు
శ్రీవసిష్ఠుడు వామదేవాది ఋషివరుల్
        నారదతుంబురుల్ సూరి వరులు
శిష్ట భక్తులు ముక్తులు సిద్ధులయ్యు!
అని నుతించుచు నిన్ జేరితయ్య! రామ!
శరణ మంటిని నన్నేల గరుణ జూపు;
రామగిరిధామ! శ్రీరఘురామ! రామ! ౨౧

అట వికుంఠము వీడి యిట మీరు వేంచేయ
        కూర్మి నీ నగము వైకుంఠమయ్యె
ఇచటి శ్రీవైష్ణవ నిచయమ్ము కనుగొన
        శ్రీనిత్యసూరులై చెలగిరయ్య!
ఇచ్చోటి సేవకుల్ స్వచ్ఛమానసులైన
        గరుడాంజనేయాది ఘనులునైరి
ఇట గల ప్రజలెల్ల నెనలేని భక్తులై
        ముక్తులు సిద్ధులై మురిసిరయ్య!
ఇచటి సీమలు కనుగొన నింపుమీర
పరమ పద సీమగా వెల్గె వరలె స్వామి!
మీ కృపాధువి మాపైన మెలగెనిటుల;
రామగిరిధామ! శ్రీరఘురామ! రామ! ౨౨

మీరిట చెలువొంద మీరెను దుందుభీ
నది యిదియె సరయూ నదిగ నొచు
మీరిట వెలయగా మీరిరి పురజనుల్
పుణ్యసాకేత సత్పుర జనులుగ
మీరిట నిల్వగా మీరెనీ పుర సీమ
శ్రీయయోధ్యా పురసీమ యగుచు
మీరిట కొలువుండ మీరిరి ద్విజశ్రేష్ఠ
ఫులు వసిష్ఠాది సన్మునులు నొచు
ఈ గిరియె చిత్రకూటమ్మై యెదిగె మీకు
జనకజా లక్ష్మణుల గూడి ఘనత మీర
స్వామి! మమ్మేల వెలసితి వేమి? రామ!
రామగిరిధామ! శ్రీరఘురామ! రామ! ౨౩

కాకతీయులనాటి ఘనశిల్పకళలీను
పటు శిల్పఘటిత దేవళమె యిద్ది
బృహదీశ్వర స్వామి పూని సేవించిన
రఘుపతి రాఘవ రాజు నీవు
గోకర్ణ భూపతి కొల్చినిన్ భక్తితో
ఇంపుగా గుడిసి కట్టించి మిగుల
ఐదు నూటరునదియౌ నెకరాల భూ-
దానమ్ము మీకిడి తనిసెనంట
భక్తు లెందరో కైంకర్య శక్తులగుచు
పేర్మి సద్భక్తి మీర సేవించి రంట!
నాటి వైభవ మీనాడు నరయమయ్య !
రామగిరిధామ! శ్రీరఘురామ! రామ! ౨౪

కాకతి ప్రభుతకు కడుపూర్వమీ పురి
సురభి పట్టణ మని బరగె నంట

సురభి పట్టణమేలు నరపతులానాడు
　　ఎంచినిన్ భక్తిసేవించి రంట
నాటి పట్టణమె యీనాటిదౌ రఘుపతి
　　పేటయ్యె నని మేటి పెజ్జులైన-
సురభి వంశమువారు సూరులీ రఘుపతి
　　పేటవాస్తవ్యులు చాటు చుంద్రు
వారి వంశీయు లర్చించి స్వామి! నిమ్ము
కదలి రానాడు; నేడు నిన్ ముదము గొల్తు
ఘన ముడుంబాన్వయులు ధర్మకర్తలగుచు;
రామగిరిధామ! శ్రీరఘురామ! రామ! ౨౫

పూర్వము శ్రీముడుంబోన్నత వంశజుల్
　　వర చక్రవర్తుల తిరుమలార్య-
దేశిక వర్యులు దేశాటనము నిట
　　కైసాగి యీ గ్రామ ఘనుడు రామి-
రెడ్డి సహాయాన దొడ్డనౌ భావిలో
　　గల భవన్మూర్తులన్ వెలికిదీసి
పాంచరాత్రాగమ పద్ధతి నీమంది
　　రాన ప్రతిష్ఠించి రక్తి మీకు-
నిత్య పూజావిధానాల నెరపిరంట
నాటినుండి శ్రీముడుంబాన్వయులు బుధులు
నరసి యర్చించు చుండిరీ నాటివరకు;
రామ గిరిధామ! శ్రీరఘురామ! రామ! ౨౬

రాజుల కాలాన రాజభోగాలతో
　　అందమ్మై తనరె నీ మందిరమ్ము
వారిచ్చినట్టి ఘనవైభవ శ్రీలతో
　　రాజిలె నీగిరి రాజ మిచట

నేటి కాలమ్మున పాటి దప్పిన వార
లెంచి భూముల నాక్రమించినారు
తమ స్వార్థబుద్ధితో దైవభీతిని మాని
స్వామి పూజకు లోటు బరపినారు
కాంచి నీ విధి నెదలోన కటకటపడి
సాధు రామేశ్వరాఖ్యుడౌ శాస్త్రిగారు
భిక్షమెత్తుచు మీ సేవ ప్రీతి జేయు
రామగిరిధామ! శ్రీరఘురామ! రామ! ౨౭

సహృదయుడుత్తముస్వాంతుడు బహుశ్రుతు
డనవద్య ధర్మనిష్ఠాగరిష్ఠు
డనఘుడు వైదికుడైన భూసురవర్యు
డనుపమధీశాలి వినుతగుణుడు
సత్ప్రజాహితుడు భాస్వంతుడు కర్మిష్ఠి
దానదయావీరధర్మరతుడు
సంతతగాయత్రిజపతపోనిష్ఠుడు
సాకేత శ్రీరామచరణహితుడు
సౌమ్యతముడు రామేశ్వరశాస్త్రి మీకు
తీని బ్రహ్మోత్సవాల నేటేట జేసి
దాసజనులను తరియించి తాదరించు
రామగిరిధామ! శ్రీరఘురామ! రామ! ౨౮

బహుశ్రుతుండౌమునవాశనుహాయోగి
కరుణార్ద్రహృదయుడై కనికరించి
సత్ప్రపత్తిని గూర్చి సద్భక్తజగతిని
తరియించజేయగా దమకమమరి

అష్టాదశపురహస్యములో ప్రబంధాల
వెలియింప నానికి నేడ్కమీర
వ్యాఖ్యలు సుమణి ప్రవాళాఖ్యభాషలో
తెలియగా వ్రాసినందించినట్టి
పిళ్లలోకార్యవర్యుల చల్లనైన
వరముడుంబాన్వయంబున వరలువారు
కీర్తిగలవారు మీధర్మకర్తలయ్యు!
రామగిరిధామ! శ్రీరఘురామ! రామ! 30

శ్రీముడుంబాన్వయుల్ శ్రీలక్ష్మణార్యులు (1)
వేంకటతిరుమల విబుధవరుల
శ్రీరాఘవార్యులు శ్రీకృష్ణమార్యులు
శ్రీకృష్ణదేశికుల్ శీలమతులు
శ్రీలక్ష్మణార్యదేశికులు శ్రీవేంకట
రామదేశికులాది రమ్యగుణులు
తరతరంబులనుండి తనురి యాలయమున
సద్ధర్మకర్తలై సాగి మిమ్ము
ధర్మతత్పరులై మీకు దాసులగుచు
త్వత్పదాబ్జాల సేవించిభవము వీడి
ఎంచి యాచార్యకృపల దరించినారు
రామగిరిధామ! శ్రీరఘు రామ! రామ! 30

సంపన్ముడుంబలక్ష్మణ దేశికస్వామి (2)
పేర్మితో మిమ్ము సేవించువారు
(3) శ్రీలక్ష్మణార్యదేశికుడు ప్రపన్నుండు
భవదంఘ్రి కైంకర్య పరుడు హితుడు
శ్రీపాండురంగదేశిక ముఖ్యుడ నఘుడు
తావక పద దాస దాస హితుడు

శ్రీశ్రీనివాస దేశికవర్యుడ లఘుడు
మీపదాశ్రయుడౌచు మెలగువాడు
సాదు శ్రీవత్సజులు మురళీధరార్య -
వేణం లును శ్యామమోహనుల్ విజ్ఞులెల్ల
ధర్మకర్తలు నైనిమ్ము దాల్మి గొల్తు
రామగిరిధామ! శ్రీరఘురామ! రామ! 32

అలనాటి వైభవమ్ములు నేడు గనరావు
నేటిప్రభుత్వాలు పాటి దప్ప
ప్రజలలో నేడు స్వార్థములె పెంపెదగాడ
భవదీయ సౌభాగ్య పటిమ తగ్గె
నాయకమ్మన్యులు నయవంచకులు నేడు
ధూర్తులు మీకీర్తి దుడు చ నెంత్రు
భయభక్తులడుగంట పాషండహృదయులు
మీ ధనమ్ముల నాక్రమించినారు
ఐన మీపైన మమతలు నారలేని
శ్రీముడుంబాన్వయ ద్విజుల్ స్వామి ! మిమ్ము
శక్తి కొలదిగ సేవింత్రు భక్తి గలిగి
రామగిరి ధామ! శ్రీరఘురామ! రామ! 33

అల ముడుంబాన్వయాండాళమ్మ శ్రీగర్భ
శుక్తి ముక్తాఫల శుభచరితులు
శ్రీవేంకటరామ శ్రీదేశికస్వామి
బహు పూర్వపుణ్యైక ఫల మహితులు
అనుపమ సుగుణంలు ననవద్య సుమతులు
భవదీయ పద పద్మ భక్తి రతులు
ఆదర్శసోదరుల్ సాధుసజ్జనహితుల్
త్యాగధనుల్ నిమ్ము దాల్మి గొల్తు

మురళిధర వేణులును శ్యామ మోహనాది -
సోదరులు నెల్ల వేళల సాధు నిధుల
నిమ్ము సేవించు చుందురు నెమ్మి గలిగి
రామగిరి ధామ! శ్రీరఘురామ! రామ! ౩౮

సాధులౌ మురళీధరాది సోదరులెల్ల
మాకు సన్నిహితులు మాన్యు లెపుడు
అలఘు సోదర సమానులు బంధుహితమిత్ర -
కోటికి విహితులై కూడియుంద్రు
ఘనమైన కవితోక్తి కైంకర్యమందింపు
డని కోర మీయాజ్ఞ తనరె ననుచు
భక్తిప్రపత్తితో భవదీయ కృపతోడ
కృతి వెలయించిమీకిచ్చుకొంటి
పురుషకారులు నీరు నీచరణసేవ
దాసునకుకల్గజేసిన ధన్యమతులు
ఇచ్చుకొంటిని కృతిని సేవించుకొంటి
రామగిరిధామ! శ్రీరఘురామ! రామ!

ఇయ్యది

శ్రీరామగిరి-రఘురామ శతపారిజాత ప్రబంధమ్మున

శ్రీరామగిరి-క్షేత్రప్రశస్తి- అను తృతీయగుచ్ఛము

శ్రీసీతా లక్ష్మణ హనుమత్ సమేత శ్రీరఘురామ

పాదపద్మార్పితమైముగిసినది

శ్రీశుభంభవతు

శ్రీః

శ్రీః

## శ్రీసీతారామాభ్యాం నమః

# శ్రీరామగిరి-శ్రీరఘురామ-శతపారిజాత ప్రబంధము

## శ్రీరామగిరి - శ్రీరఘురాముని మేలుకొలుపు చతుర్థగుచ్ఛము

శ్రీరామ చంద్ర! లేరా! రామ! గుణసాంద్ర!
        బ్రహ్మముహూర్తంబు వరలెనయ్య!
పులుగడిగిన మంచిముత్తెంపుజిగిగల
        మొయిలి మేల్ముసినవ్వు మూటయనగ
తూరుపు దెస మూల దోచెను నింగిపై
        నిలువైన కాలపు వేగుచుక్క
కరువలి చల్లగా కదలి మెల్లగవీచె
        పూలతోటలతావి పుక్కిలించి
ముద్ద మందార సింధూర మద్దినట్లు
మురుయు దెస సిరి చెంపల యెఱువులెక్క(లాయె)
మాన్య ! మేల్కొమ్ము ముసిముసి మబ్బలాయె
రామగిరి ధామ! శ్రీరఘురామ! రామ! ౧

సౌభాగ్యవతి మహాసాధ్వి కౌసల్యకా
        మేలైనకడుపు (1) ముత్యాల పంట
జనకుడౌ దశరథ స్వామి యొనర్చిన
        చవుల నూరించు యజ్ఞంపు ఫలము!
కోసలసామ్రాజ్యభాసుర లక్ష్మికా
        న్యాయ ధార్మిక మహానాయక మణి!
పరమ ధార్మికులైన ప్రజల కోర్కెల దీర్చు
        ఘనమైన సురసేవ్య కల్పశాఖి !

(1) నీలాల

స్వామి! నరసింహా! ప్రాభాతసంధ్యలెదిగె
వేగ మేల్కొని లేర ! సద్విధులు దీర్ప
దేవ! శ్రీదుందుభీనదీ తీర లలిత-
రామగిరిధామ! శ్రీరఘురామ! రామ! ౨

లే లేర ! మా యయ్య ! లే లేర ! మా తండ్రి !
లేర ! సీతారామ ! లేర ! స్వామి !
లేవరా ! గరుడధ్వజా ! వేగ లేవయ్య
ధీర ! మేల్కొర ! బంగారుతండ్రి !
లేర ! శ్రీధర్మావతార ! లేరా ! ప్రభూ !
సగుణ మాయామానుషాంగ ! లేర !
జగదేక భూ రమా జాని ! లేరా ! దొరా !
జనక జామాత ! సద్వినుత ! లేర !
రఘుకులాన్వయ సౌజన్య రత్నదీప !
దైవదిన సంధ్యవిధిదీర్ప లేవవయ్య!
రామ ! రఘుపతిరాఘవరాజ ! రామ!
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! 3

జాగృతిన్ గనుమయ్య ! జగదేకరామయ్య !
దశరథ కీర్తి పతాక ! లేర !
విశ్వసన్నుత వీర విజయరామా ! లేర !
ధీర ! దయాధర్మవీర ! లేర !
జయగుణోన్నతరామ ! జయజయశ్రీరామ !
సాకేతరామ (మా) నా స్వామి లేర !
శుభరామ ! శ్రీశుభవిభవసుందరరామ !
రామ ! శ్రీ కల్యాణరామ ! లేర!
పుణ్యరఘువంశ శ్రీ మూల పురుషుడైన
భాస్కరస్వామి ప్రాగ్వధూభాగ్యరమకు
దివ్య సింధూర తిలకము దిద్దె లేర !

రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౮

(సీతమ్మ)

వసుమతీ సుమతి పావనరత్న గర్భమం
దలరిన వాణి ముత్యాలసిరివి
మిధిలాధినాథుని విధివిధానంబైన
బహుజన్మ కృత తపఃఫలము నీవు
తన కోడలుగ వెల్గ దశరథ విభునిదౌ
కోటి పూజల ఫల పేటి వమ్మ !
జన్మజన్మలలోన సహధర్మ చారివౌ
రాముని హృదయాభిరామ నీవు
తల్లివై యున్న జనకకల్పవల్లివీవె
అమ్మ ! తెలవారెలెమ్మ సీతమ్మ! యనుచు
మేలుకొల్పితి నీసతిన్ మేలుకోర !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౯

(లక్ష్మణస్వామి)

సతి సుమిత్రాదేవి స్వర్ణశౌక్తికగర్భ
సంజాతమౌ నవరంజి పంట
పంక్తిరథస్వామి బంగారు కలలన్ని
వెసఫలించిన మేల్మి పసిడిపంట
జనక శతానంద జపయజ్ఞ ఫలమైన
ఊర్మిళాదేవికౌ పేర్మి పంట
శేషశేషత్వమ్ము చెలునార సగ్రజు
పదసేవకైన పుష్పములపంట
లక్ష్య లక్షణ లక్షిత లక్ష్మణార్య !
రాఘవానుజ! మేల్కొనరా! యటంచు
స్వామి ! లేపితి లక్ష్మణ స్వామి నిపుడె;

రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౬

(ఆంజనేయస్వామి)

అంజనాసతి తొల్త నపురూపమౌ నోము -
నోచగా గల్గిన నోముపంట
జవసత్వముల వెల్గు పవనుడొనర్చిన
పరిపూర్ణప్రేమ తపఃఫలంబు
సుగ్రీవరాజు భాసురమైన స్నేహస -
మ్మిళిత పూజల గల్గు మిత్రఫలము
రామలక్ష్మణమైథిలీ మాతృదేవుళ్ల
వాత్సల్యవ్రతముల వరలుపంట
భక్తజగతికి నాదర్శ పథము జూపు
వాయునందన ! మేల్కొనవయ్య ! యనుచు
మేలుకొల్పితి పావనిన్ మేలుకోర !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౭

(నిత్యసూరివర్గము)

నినుభక్తి సేవించు నిత్యసూరుల నెల్ల
కొమరొప్ప నిద్ర మేల్కొలిపినాను
శేషత్వమలరిన శేషాదికైంకర్య
శీలుర మేల్కొల్ప జేసినాను
నారదతుంబురు నవమనోహర వైణి
కుల గాయకులను మేల్కొల్పినాను
గరుడ గంధర్వ కిన్నెరుల నప్సరసలన్
చెలిమి మీరంగ మేల్కొలిపినాను
సిద్ధులను ముక్తులను లేపి బద్ధజనుల
తెలిపి భవముక్తి విధుల మేల్కొలిపినాను
కొలువు తీర్పగ లేర వైకుంఠ రామ !

రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౮
దాసుల రక్షింప దయజూడగా లేర !
కోదండరామ ! మేల్కొర తండ్రి !
శరణాఽగతార్తులం గరుణింపగా లేర !
కారుణ్యమూర్తి ! మేల్కాంచవయ్య !
ఆశ్రిత సుజనుల నాదరింపగ లేర !
కాకుస్థరామ ! మేల్గాంచు స్వామి !
ఉదయవేళాయె సీతా మనోభిరామ !
పడతి సీతమ్మకౌగిళ్ల సడలవయ్య !
అయ్య ! కొలువుకు వేళాయె నయ్య ! లెమ్మ
రామగిరి ధామ! శ్రీరఘురామ! రామ! ౯

ముగ్గురమ్మల పేర్మిమురిపాలరామయ్య !
లేర తూరుపు తెల్లనారె నయ్య !
దయగల ధర్మయ్య ! దశరథ రామయ్య !
వేళాయె సేవకుల్ వేచిరయ్య !
సీతమ్మ చిన్నయ్య ! శ్రీరామ చంద్రయ్య !
ముసి ముసి తొలిసందె మసలె నయ్య !
తూరుపు కనుమలో తొలిసందెదొరసాని
సూరన్న కై తొంగి చూచె నయ్య !
కడుపసందగు చిరుపిల్లగాలిదొరలు
చల్లచల్లగ మెల్లగా సాగిరయ్య !
అయ్య ! మేల్కొని శ్రీరాములయ్య ! లేర !
రామగిరి ధామ ! శ్రీరఘు రామ ! రామ ! ౧౧

తేట తెల్గులతోడ, తెలుగు వెల్గుల తోడ
తేట తెల్గుల తేనె పాట తోడ
చల్ల చల్లని తెల్గు పిల్ల గాలులతోడ

తెలుగమ్మ ముసి నవ్వు వెలుగు తోడ
తెలుఁగ పరంజి బొమ్మల నవ్వు జిగితోడ
తెలుగు కోడెతనాల తళుకుతోడ
తెలుగుందనంపు జాణల సోయగముతోడ
తెలుగు రాచరికాల కలిమితోడ
తెలుగు దనములు పరిచెడి చెలిమి తోడ
దొరవెలుగుల సూరన్న తూర్పు పడతి -
సోయగము దిద్దె లేవరా! తోయజాక్ష!
రామగిరిధామ! శ్రీరఘురామ ! రామ! ౧౧

గోవుల గోపన్న లావుదూడల వెంట .
సద్దిమూటలతోడ సాగునపుడు
నునుపిల్లనం గోవులను నూది కమ్మగా
పలికించు రాగాల పసదనాలు
చల్లలు చేసెడి గొల్లభామల చేతి
గాజుల వినసొంపు గల్గలాలు
గువ్వలు గోర్వంక కోయిలల్ చిలుకలు
తెలుగు తేనియపల్కు పలు పలుకులు
మోట గొట్టెడి రైతన్న మురువు పాట
అందమలరగ వీనుల విందుసేసె;
రామ! వినసొంపులయ్యెనో స్వామి! లేర!
రామగిరి ధామ! శ్రీరఘురామ! రామ! ౧౨

త్రిభువనేశుడవైన శ్రీరఘునాయకా!
తోయజాప్తుండు దోచె దూర్పుదెసన
అజ్ఞాన తిమిరంబు లంతరించినవయ్య !
తావక సుప్రభాతములు విరియ
ప్రొద్దు ప్రొద్దునవిచ్చు పూలమరందాలు

మధువుల పరిమళాల్ మసలి కురిసె
పతులు భూపతులు దిక్పతులు దివ్యులు తపు-
విసిధ సేవార్ధులై సేవినారు.
వారి పలు వాహనముల ఘంటారవాలు
అబ్ధి ఘోషల మీరి మిన్నంద ముట్టె
లెమ్ము వీరికి మీ దర్శన మ్మొసంగు
రామగిరిధామ! శ్రీరఘురామ ! రామ ! ౧౪

మొల్లల పరిమళాల్ పూని చల్లని గాలి
తనువుకు గిల్గిలింతలను బెట్టె
జలజాల నిద్రించు కలహంస జంటలు
మంచురెక్కలదల్చి మసలి లేచె
ఉగ్రనక్రముసోట నుక్కిరి బిక్కిరౌ
గజరాజుగాచిన ఘనుడ! లేర!
అప్సరోభామినులందించు పరిచర్య
లందుకోనలెను మేల్కాంచు స్వామి !
భక్తు లిట వేచిరయ్య! ప్రసత్తిగలిగి
పేర్మిదయలుంచి మాపైన వేగలేర!
కాలకృత్యమ్ములను దీర్ప లేర! స్వామి!
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ! ౧౪

తూరుపు కనుమలో తొలిసందె దొరసాని
ముసినవ్వు రాగాలు మొలకలెత్తె
వేగుచుక్కేపొడ్చె, వేనెల్గుదొర తూర్పు-
పూబోడి మోముపై ముద్దు వెట్టె
చుక్కల దొరసాండ్ల చూపులో చంద్రయ్య
ప్రక్కకు దిగజారి సయన మయ్యె
పూదోటలో సోకపూలతాసినిదోవి

కదలాడె నుదయపు గాలి కూన
కుటిలమతులైన పగవారి గుండె లదర
దండిదోర్దండమందు కోదండమలర
వెలుగు కోదండరామ ! వేవేగలెమ్ము
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౫

ఆలమందలతోడ నరుగు గోపాలుర
కొమరొప్పు జంపనకోల పాట
మేల్మికోడెద్దుల మెడ గంట సవ్వళ్ల
దిక్కులు మార్మోగ త్రొక్కి కలిసి.
ఆ సవ్వడికి తేటు లానుచు పూదేనె
నదరుచు పరుగిడి చెదరిపోయె
ముని రాజు జన్నమున్ బూని కాపాడిన
కీర్తితరామ ! సాకేతరామ !
చండ రిపు కుల భుజ దండ ఖండినోరు
పండితోద్దండ కోదండ మండితార్య !
(1) వీరరాఘవ ! మేల్కొనవయ్య! ? స్వామి !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౬

అల విభీషణునిచే నర్చనల్ గొనుస్వామి !
మాకు సర్వస్వమై మసలు స్వామి !
మీ పూలతోటలో మేల్కొని పక్షులు
కలమ్ముదు స్వనములన్ గలిసి కూసె
రేయెల్ల గడి చెను మీ యర్చనలకెల్ల
వేళాయె, వందుల వినుతు లె దిగె
టంట్ల సవ్వడి మీరెదేవాంగనలు మిమ్ము
సేవింప వాకిట చేరినారు.
పరమ భక్తులు స్నాతులై వచ్చినారు

(1) రామ! శ్రీవీర కోదండరామ! లేర!

పూని సద్భక్తి తో నర్ఘ్యములను గొనుచు
వేచినారయ్య ! కరుణించి వేగ లేర !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ! ౧౭

తామ్రోదర ద్యుతిన్ దలపించు మీ పాద
పద్మాల సేవింప భక్తిమీర !
ద్వాదశాదిత్యు లేకాదశరుద్రులు
తేరులపైన నేతెంచినారు
వసు మరుద్గణములు వాహనమ్ముల పైన
వచ్చి వాకిట బరాబరులొనర్చె
గంధర్వులప్స రాంగనలాట పాటల -
తో వేచిరయ్య ! ఓ తోయజాక్ష!
కనకమయ భాను కిరణాల గలిగి హేమ
(1) రమ్యగిరి రామగిరి మందిరమ్ముముందు
గుహుడు సేవింప వేచె మేల్కొనవె ! స్వామి !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౮

ఇంద్రుడైరావత మెక్కి మీ యాలయ
ద్వారదేశమ్మున చేరినాడు
సకలదేవతలును సనక సాదులు మునుల్
యక్షగంధర్వ విద్యాధరాళి
వరమరుద్గణములు వచ్చి కిక్కిరిసిగా
త్రొక్కిసపడినారు త్రోసికొనుచు
నింగిని నేలను నెరుగరాకుండగ
వీరి సమ్మర్దనల్ మీరుచుండె
హెచ్చు మీ పాద సందర్శనేచ్ఛ వీరి-
నిట్లు గావించుచుండె నో నీలవర్ణ !
మాన్య! మేల్కొన్న సమ్మర్ద మాగునయ్య !

(1) గిరివరమ్మైన శ్రీరామగిరిన భక్త-

రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౯

పరిమళద్రవ్యాల పలు శంఖ పద్మాది
    నిధుల నర్పింప సన్నిధిన సురులు
కపిలధేన్వాది యర్ఘ్యములతో ఋషివరుల్
    తుంబురు నారదాదులు సరసులు
వచ్చి మీ వాకిట వరుసగా నిలుచుండి
    సేవింప మిమ్ముల జేరినారు
వేవెలుంగులదొర విరిసె తూరుపు దెస
    చూచువారలకండ్ల జూరగొనుచు
ప్రబలమౌ చీకటులు పటాపంచెలయ్యె
మమ్ము బాధించు నజ్ఞాన మార్పివేయ
రాఘవా ! మేలుకొనుమయ్య ! రామ ! లేర !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౨౦

వేణు వీణా తాళ పాణులై మార్దంగి-
    కులు నౌచు యక్ష సిద్ధులును సురులు
గరుడ గంధర్వ కిన్నెర చారణులు మునుల్
    విద్యాధరుల్ ఋషుల్ విబుధవరులు
తావక పద పద్మ దర్శనోత్సాహులై
    నెట్టు కుంటెట్టులో నిలిచినారు
పరమప్రపన్నులౌ భవదీయసేవకుల్
    విధి నిర్వహణముకై వేచినారు
కాన వారికి భవదీయమైన విశ్వ
రూప దర్శన మొసగుట కోపి మీరు
మేలు కొనరయ్య ! దాసుల నేలుకొనగ

రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౨౧

కమలాప్తుడు దయించె కమలముల్ వికసించె
(1) పలుతీరుపులుగుల సలుకులలరె
పిడికెడు నడుమున్న పడతు లీదుందుభీ-
నదిలోన భక్తితో స్నానమాడి
కొమరు చీరల పిండుకొని మిమ్ము దర్శింప
తీరమారోహించినారు స్వామి !
దేవరవారిని సేవింపదాసుడు
తులసీసుమాలలతో డ వచ్చె
స్వామి నాపైన మిత్ర భావంబులుంచి
తావకీనాబ్జ పదదాస దాసతతికి
దాసునిగంజేయ మేల్కొని దయలజూపు
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౨౨

జలజముల్ వికసించె; జక్కువ కాకలు
సమసె; తారలతోడ చంద్రు డరిగె
శుక కాక టిట్టిభ పిక భరద్వాజముల్
ఘనముగా మధురమౌ ధ్వనులుసేసె
సంతమసంబెల్ల సతమతమ్మై మాసె
ఉదయించె మార్తాండు డుదయ గిరిన
ముసి ముసి నవ్వుల మురిసిరి దిక్సతుల్
కువలయ శ్రీ నిద్ర గూడెనయ్య !
కోళ్లు గూసెను; కొక్కొరకో యటంచు
మసలెకరువలి సుమపరిమళ ముగూడి

(1) పక్షులకల మృదుస్వనములలరె

జగము మేల్కొనె నిదురేల ? స్వామి ! లేర !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౨౩

ఉదధి సోమకు ద్రుంచి విధికివేదము లిచ్చి
తనరిన మీనావతార ! లేర!
అసురుల వంచించి యమరాళి కిడి సుధన్
తనరిన కూర్మావతార ! లేర !
అల హిరణ్యాక్షుని నణచి భూమిని దెచ్చి
వరలిన శ్రీకిటస్వామి ! లేర
ఖలుహేమ కశిపుని కడతేర్చి శిశుగాచి
మీరిన నరహరీ ! లేర స్వామి !
బలిని నణచిన నాయన ! పరశురామ !
రావణాంతక రామ ! శ్రీరామకృష్ణ !
కల్కి ! వివిధావతార ! మేల్కాంచవయ్య !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౨౪

ఆచార్య పరమ దివ్యాచార్య కృపలతో
వరప్రపన్నుల దయాసరళితోడ
మాన్య భాగవతోత్తమాదుల పేర్మితో
పెద్దలాశీస్సుల సిద్ధితోడ
భవదీయ దివ్యాంఘ్రి పద్మ భక్తిని గల్గు
పరమ భక్తుల కనికరముతోడ
తల్లి సీతమ్మ వాత్సల్య సంపదతోడ
మేలైన మీ యాదరాల తోడ
పలికి నానయ్య ! మీ మేలుకొలుపు స్వామి !
ఎవరు చదినవారికి భయము బాపి
భోగ భాగ్యాల సిరు లిడి బ్రోతునంట
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౨౫

ఇయ్యది
శ్రీరామగిరి - శ్రీరఘురామ శతపారిజాతప్రబంధమ్మున
శ్రీరామగిరి - శ్రీరఘురాముని మేలుకొలుపు అను చ-
తుర్థగుచ్ఛము సర్వము - శ్రీరఘురామపాద
-: పద్మార్పితమై ముగిసినది: -

శ్రీః

శ్రీసీతారామాభ్యాంనమః

## శ్రీరామగిరి – శ్రీరఘురామశతపారిజాత ప్రబంధమున

## శ్రీరామగిరి – శ్రీరఘురామ శరణాగతి – పంచమగుచ్ఛము

శ్రీజగ దధినాథ శేఖరాళుల కెల్ల
అధినాయకుం డయోధ్యావిభునికి
తత్పాద పద్మ సౌందర్య రమ్యా రాధ -
నా తత్పరాత్మగా నలరు సతికి
క్షీరాబ్ధి జాతయౌ శ్రీమహాలక్ష్మియే
ధర్మావనుండైన నిర్మలునికి
సహధర్మవర్తిగా చరియించు సాధ్వియౌ
జగదేక నాయికాచారుమతికి
భక్తజగతిని వాత్సల్య భావమమరి
రక్షసేయింప పురుషకారంబుసేయు
ధరణిజకు త్వత్పదాలకు శరణమంటి!
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧

అసురు సోమకు ద్రుంచి యజు కాగమములిచ్చి
ధరణి నేలిన మీన ! శరణం నీకు
సురవైరుల నదల్చి సురులకు సుధ నిచ్చి
కరుణ గాచిన కూర్మ ! శరణం నీకు
హేమాక్షు బరిమార్చి భూమిని రక్షించి
వరలిన కిటిరూప ! శరణం నీకు
కనక కశిపు ద్రుంచి దనుజ బాలుని గాచి
వరవీర నరహరీ ! శరణం నీకు
వామనస్వామి ! భార్గవరామ ! రామ !
రామ శ్రీకృష్ణ ! కల్కీశ ! స్వామి ! రామ !
శరణ మంటిని గావు నన్ కరుణ నంటి
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౨

''సత్ప్రపన్నత గల్గి స్వామి ! మీ దాసుండ
నని చేరువానిని ఘనత మీర
అభయ ప్రదుండనై యాదరింతును నేను
ఇది నావ్రతంబని'' యెఱుక జేసి
''స్నేహ భావము తోడ సేవింపవచ్చిన
దోషవంతుని నైన ద్రోయకుండ
నావాడె యని వాని నర్మిలి రక్షింతు''
నని మాటయిచ్చిన ఘనుడ వీవె
''పాపునైనను పావన స్వాంతు నైన
వధ్యుడైనను నన్ జేరు వాని గాతు''
కరుణ నుడివిన మీకిట శరణమంటి
రామగిరి ధామ ! శ్రీరఘురామ ! రామ ! 3

''స్వష్ట చిత్తుండైన స్వాస్థ్య దేహుండైన
ధాతు సామ్యస్థిత ధర్ముడైన
ఏ మానవుడు నన్ను నిట విశ్వరూపుడు
అజుడు నవ్యయు డని యాత్మ నెఱుగు-
వానిని పటుకాష్ఠ పాషాణ నిభుడైన
మ్రియమాణుడైనను రీతి నెఱిగి
ఆ యోగ్య భక్తునే నవిశంబు స్మరియింతు
ఇహ పర గతుల పొందింతు నేను''
అని శపథమొప్ప పలికిన ఘనుడ వీవె
ఇతరు లెవ్వరు నినుబోల రెందు నైన
అని నుతించుచు శరణంటి నాదుకొనవె !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ४

''నిజము వచింతు నే నెఱుఁగుడో జనులార !
    స్వయముగా నెవడూర్ధ్వబాహుడయ్యి
నరహరీ ! శ్రీముకుందా ! జనార్దన ! జయ
    రఘురామ !'' యని నన్ను రక్తి నీర
జీనించుచున్ గాని బుణివలె నురణానమం
    దైన జపించున్ో యనుదినంబు
పాషాణకాష్టంబు వలె నుండినన్ గాని
    వానికి ముక్తిని బడయ నిత్తు''
అని వచించిన మహిత దయాంతరంగ
భాసమానుండవైన నిన్ భావమందు-
నిలిపి పేర్మిన శరణంటి నేలుమంటి
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౫౫

''సద్ధర్మ నిరతులై సత్ప్రపత్తుల గల్గి
    పాటించి నినరయ్య ! భక్తులార !
ఇతరాంతరమ్ముల నెద నిస్మరింపుడు
    సర్వమై యున్న నా స్మరణ గనుడు
నావారె మీరని నన్ను యెల్లప్పుడు
    సర్వధా మిము నేను సంస్మరింతు
అపవర్గమున కిది యైన యుపాయంబు
    తెలియుడు గోప్యమున్ దెలిపినాను''
పరమ కారుణికులునౌచు పరమకృపల
రక్తి నుడివిన శ్రీరంగ రామరాజ !
నిన్ను దలచుచు శరణంటి నేలవయ్యా !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౬

షడ్వర్గరిపుదూష్య సంసార సంబంధ
        బంధముక్తిని గోరు వార లిపుడు
సుకృత దుష్కృతముల వికృతమౌ కర్మల
        అడుసు గడ్డిగినయట్లు కడిగివేసి
తత్పూర్వ కర్మల దగిలెడు ఫలముల
        మది నాస గొనకుండ వదిలివేసి
సద్ధర్మ నిరతులై సత్ప్రపత్తిని గల్గి
        పూని నన్ శరణంబు బొందుడనుచు
రంగ దుత్తుంగ కరుణాంత రంగులౌచు
రక్తి దెలిపిన శ్రీరంగ రామ రాజ !
సర్వమున్ వీడి నిన్ను నే శరణమంటి
రామగిరి ధామ ! శ్రీరఘురామ ! రామ ! ౭

నా నిమిత్తము సేయు నఘమైన పుణ్యమే
        సంపదాపదలందు సాకుచుండు
నను తిరస్కృతి జేసి నయధర్మముల వీడి
        చేయు పుణ్యము లన్ని చెడును గూర్చు
పరమ పవిత్రమౌ ప్రతివస్తువులలోన
        పరమ పవిత్రునై పరగువాడ
సకల దేవతలందు సర్వేశ్వరుడ నేను
        భూతకోటికి నేనె పూజ్య పితను
నెమ్మి నాపైన భారమ్ము నమ్మి వేసి
కార్యమున సాగువానికి క్షతియులేదు''
ఎఱుంగుడని తెల్పుసామి ! నిన్ శరణమంటి
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౮

''ఐహిక సంబంధ మరయ దేహాత్మాభి
మాన సంబంధమున్ మరచి వేడి
నేనె నీవాడను నిన్నె నే శరణంటి
నను వాడు నెట్టివాడైన గాని
వాడు నాకోవలో వరలు; నావాడని
వాని కభయమిడు వ్రతమె నాది
ఇదియె నిత్యంబు సత్య మియ్యదియె నిత్య
సత్యమైనది యని మాకు జాటినట్టి
కరుణగల తండ్రి వీనెరా ! శరణం మీకు
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౯

''నావైన దివ్యజన్మల కర్మ విధముల
నుత్పత్తిక్రమముల నోర్పుగల్గి
ఎఱుకతో నెవ్వడు నెఱుంగ యత్నించునో
జగతి వానికి పునర్జన్మలేదు
నే నొకడనె తప్ప నిల నన్యు లెవ్వరు
పరతత్వమున కర్హపదము గారు
త్యజియించి భౌతికధర్మసర్వస్వమున్
పూని నన్ శరణంబు బొందువాని
సర్వదుర్వార పాపపుసమితినుండి
ముక్తిగావించి దుఃఖ విముక్తి జేతు,
నని వచించిన నిన్ శరణంటినయ్య !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౦

ఏ మీ పదంబులు నిల నెల్ల గొలిచెనో
ఆ పదంబుల శరణంటి నయ్య !
ఏ మీ పదంబులు నిల గంగ పుట్టిల్లో
ఆ పదంబుల శరణంటి నయ్య !

ఏ మీపదంబులు నిభను గానగ సొగె
ఆ పదంబుల శరణంటినయ్య !
ఏ నీ పదంబులు శ్రీమానితంబులో
ఆ పదంబులశరణంటినయ్య !
ఏ పదంబులు నిహపరప్రాపకములో
ఆ పదంబులె భవదీయ శ్రీపదములు
స్వామి ! శరణంబు మాకవి, సన్నుతింతు
రామగిరి ధామ ! శ్రీరఘురామ! రామ ! ౧౨

అలచతురాననుండాగమోక్తుల తోడ
కడిగి యేపదముల ఘనత గాంచె
పరమభక్తాగ్రణి ప్రహ్లాద బాలుడు
ఏ పదమ్ముల గొల్చి యాపదుడిగె
ఆటవి కాంగన యగు శబరీ మాత
అర్చించి యేపదాబ్జముల దనిసె
సవతి తల్లీసడించగ రాకొమారుడు
ధ్రువుడయ్యె యే పదస్తుతియొనర్చి
వినుత వేదోపవనముల వీధులందు
పరగవిహరింప గల్గు నే పదము లెపుడు
స్వామి ! ఆ మీ పదాలనే శరణమంటి ;
రామగిరిధామ ! శ్రీరఘు రామ ! రామ ! ౧౩

రాయియై పడియున్న రమణి యహల్యకు
శాపంబు బాపె నే చరణయుగళి
జనక మహారాజు జానకి నిడువేళ
సద్భక్తి గడిగె నే చరణయుగళి
సీతావధూటి తా జేరి యేకాంతాన
మురిసి ముద్దాడె నే చరణయుగళి

గంగ దాటెడు వేళ ఘను డాగుహుం డోర్మి
బరగి తాగడిగె నే చరణయుగళి
పేర్మిలక్ష్మన్న; హనుమ; విభీషణుండు
పరగ సేవించుకొన్న (మన్న) నే చరణయుగళి
ఆ త్వదీయాంఘ్రులను శరణంటినయ్య !
రామ గిరిధామ ! శ్రీరఘురామ ! రామ !

ఇహపరసాధనావహము లేపదములు
భవభయాపహములు భాసురములు
దురితాప హరములై వరలు నే పదములు
కల్యాణ వైభవా కర మహిమలు
ఘన సాధు జన పాలకములు నేపదములు
వినుతమౌ పతిత పావన శుభములు
శరణన్న వారిని సాకు నే పదములు
దురతా రిజన భీతి కర గరిమలు
ఆ పదంబులు నాపద హర పదములు
వితతభవహర భవదీయ నుత పదములు
శరణ మను వారికైన రక్షక పదములు
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౮

భవదీయసన్నిధిన్ ప్రతినిత్య మేతెంచు
హరిహర బ్రహ్మాదిన్యాదిగణము
తేజోవిశేషులౌ రాజాధిరాజులు
సాష్టాంగవినతులు సలుపుచుండ
వారలనవరత్న చారుకిరీటసం
చారకాంతిశ్రీలు హారతులుగ
గలుగగ జెలువొందు ఘనతర దీప్తితో
పలుశోభ లీను మీ పాదములను

నిత్య సూరులు సిద్ధులు నిఖిల ముక్త
భక్తసుజనుల ప్రణతుల బరగి వెలుగు
నీపదంబుల శరణంటి ప్రాపు నిడవె !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౫

భవదీయ నామాలు భువనైకదీపాలు
భక్తుల పాలి కల్పద్రుమాలు
భవదీ య సుగుణాలు భక్తసంభూష్యాలు
ఇహపరసౌఖ్యప్రదేడితాలు
భవదీయ చరణాలు భక్త సంత్రాణాలు
దారుణ సంసార తారకాలు
భవదీయ హృదయాలు భక్త సంభావ్యాలు
వాత్సల్య సత్సుధావైభవాలు
రామ భవదీయ ప్రబల పరాక్రమాలు
వైరివీరుల హృదయ విదారకాలు
అనుచు శరణంటి జూపు నీ యాదరాలు
రామగిరిధామ ! శ్రీరఘురామ! రామ ! ౧౬

కల్యాణ గుణ గణ కమనీయ పరిపూర్ణ
హృదయమంజులసీమ ! మధురనామ !
కారుణ్యరసమయ కమలా యతేక్షణ !
భక్తసంత్రాణ కృపాఢ్యసుగుణ !
శరణాగతార్తరక్షక ధర్మ బిరుదాంక !
క్షాళిత సుజనదుష్కలుష కలుషపంక !
దుర్వార మద దుష్ట గర్వాద్యహంకార
వైరదుర్దైత్య సంహార ! వీర !
సుజన పాలనపారీణ విజయరామ !
జానకీరామ ! సూర్యవంశాబ్ధిసోమ !

చేరి శరణంటి నిన్ను రక్షింపుమంటి,
రామగిరిధామ ! శ్రీరాఘురామ ! రామ ! ౧౭

నన్ను నీవిలపేర్మి నమ్మి సంస్మరియింపు
స్వామినై నిన్ను నే సంస్మరింతు
ఇహ పర తారకం బిదియె యుపాయంబు
అని తెల్పినారు కృపాంతరంగ !
మీ మాట నేనమ్మి యేమాత్ర మితరమ్ము
సంస్మరింపక నిమ్మె సంస్మరింతు
ఆచార్య కృపతోడ నాటీరె మీనాను
జపము ధ్యానము చేయ సాగుచుంటి
దీనదుఃఖార్తులకు నీరె దిక్కటంచు
చేర శరణంటి నీ పాద నీరజముల
నన్ను గాపాడ ధర్మ మెంతైన మీదె
రామగిరధామ ! శ్రీరఘురామ ! రామ !

ఇయ్యది
శ్రీరామగిరి - రఘురామ శతపారిజాత ప్రబంధంబున
శ్రీరామగిరి - శ్రీరఘురామ - శరణాగతియను పంచను
గుచ్ఛము - సర్వము శ్రీరఘురామ పాదపద్మా
ర్పణమై ముగిసినది

**- ః శ్రీశుభం భవతు ః-**

శ్రీః

శ్రీసీతాలక్ష్మణ హనుమత్ సమేత శ్రీరామచంద్రాయనమః

శ్రీరామగిరి - శ్రీరఘురామ శతపారిజాత ప్రబంధము

శ్రీరామగిరి - శ్రీరఘురామునికి విన్నపములు - షష్ఠము గుచ్ఛము

విన్నపము

శ్రీరామ ! జయజయ శ్రీజానకీ రామ!
లావణ్యసీమ ! కల్యాణరామ !
శ్రీశుభంకర నామ ! శ్రితజనావన ప్రేమ !
ఘనసద్గుణసస్తోమ ! కలివిరామ !
కైవల్యవిభవద కారుణ్యగుణసీమ !
భక్తతాపాపహభద్రనామ !
ధరణిజా మానసోద్యాన విహంగమా!
కమనీయ మధుర శృంగారరామ !
మౌనిమానస సకల హంసమా ! మనోజ
సరసకవి నుత సాకేత సార్వభౌమ !
(1) రామ! రక్షించు మామక ప్రేమసీమ!
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! (1)

స్వామి ! మీ యవతారవైభవ శ్రీలెల్ల
ధర్మరక్షకములై తనరు నేల,
విశ్వవిఖ్యాతమై శాశ్వతకీర్తితో
పండిన వేదసంపదల నేల
ఉపనిషదురు నందనోద్యానవిహారులు
పరమర్షులన్ గన్న పసిడి నేల
సత్యధర్మ పురాణశాస్త్రేతిహాససౌ-
భాగ్యలక్ష్ములు కొలువైన నేల

(1) బ్రోవుమా! రామ! సద్భక్త పుణ్యఫలము!

సకలసాహిత్య సంగీత సుకృతలక్ష్మి
రాజిలిన నేల యిదియె భారతపు నేల
కలతకిరవయ్యె నేడిది కాంచుమయ్య!
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౨

రాజరాజ నరేంద్ర రత్నమౌళిప్రభా-
పటల భూషితమైన భవ్య భూమి
లలితసంస్కృతుల సింహళదేశమేదిని
పాదపీఠమ్మైన స్వర్ణ భూమి
హిమవన్నగోత్తుంగవిపులోచ్చనగపాలి
వజ్రకిరీటమై వరలు భూమి
విశ్వమానవతకు వినుత ధార్మిక నాగ -
రికత దెల్పిన మేటి సుకృతభూమి
సాధు సత్కర్మధార్మిక వేద భూమి
భరతభూమిది, నేడిది భద్రతుడిగి
కొరకొరల గూడె గనవె! కాకుస్థరామ !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! 3

బ్రతుకనివ్వరు నేడు ప్రజలను పెద్దోళ్లు
పెద్ద పెద్దోళ్లైన పెద్దపులులు
స్వార్థపరుల్ నేడు సంసారజలధి
జనుల జీవననౌక సాగనివరు
కామందు లిల నేడు కసరు రాబందులై
ఎంచి సాధుల కబళించిరయ్య !
మేకవన్నెల పులుల్ మేదినిన్ దిరుగాడి
ప్రజల రక్తమ్మును బట్టి పీల్చె
సత్య ధార్మిక నైతిక స్వామ్యములను
నీళ్ల జేసిరి దుస్స్వార్థ నేతృచయము

ఏమి? రఘువీర ! చూచెదవేమి స్వామి ః
రామగిరిధామ! శ్రీ రఘురామరామ ! ౪

సత్య ధర్మా2హింస శాంతిసన్మార్గాలు
పుట్టినిల్లైన దీ పుణ్యభూమి
వైదిక విధి కర్మ వ్యాపార కృషి పశు-
పోషణ కర్మసంతోష ధరణి
వేద వేదాంగాది వీధులన్ విహరించు-
పండితోత్తములు పెంపైన సీమ
భవదీయ దివ్యవైభవ విశేషము లొప్పు
ధర్మా వతారసంతతుల సీమ
పరమభక్తుల కిరవైన భరతసీమ
నేడు నీ సీమ సొగ సెల్ల వాడిపోయె
వైకృతిని దాల్చె చూచితివయ్యా! స్వామి !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౫

నా చిన్న నాట నే చూచితి భూగోళ
శాస్త్రము చదివెడి సమయమందు
భారత భూమి సర్వాంగ సుందర మైన
గోస్వరూపిణి యాచు గోచరించె
భారతభూమి పెంపగుటేమొ కన నేడు
కొమ్మల నరకిన కుజమువోలె
కనబడుచున్నదేకాని యా రూపంబు
కను విందు సేయగా గాంచలేను
ఎందరెందరో ధూర్తులు దుర్విదగ్ధ -
స్వార్థకుమతులు దేశమున్ భగ్నపరచ
చీల్చి రానాడు నేటికిం జీల్చ నెంత్రు
రామగిరధామ ! శ్రీరఘురామ ! రామ ! ౬

పుణ్యప్రదంబులై మోక్షదాయకములౌ
　　నగరులం దాద్యమౌ నగరమైన
శ్రీమదయోధ్యాఖ్య శ్రీనగరమ్మది
　　రఘువంశరాజుల రమ్యచరిత
జాటుచునున్నది సర్వదేశాలకు
　　సాటి పోటీ లేక నేటికైన
ధర్మావతారులై ధరణిలో వెల్గిన
　　భవదీయ కీర్తితో బహుళమగుచు
అవని జెలువారుచున్న నీనగరమందు
రాక్షసాత్ములు హింసారిరంసులగుచు
హింస లొనరించి రయ్య! సహింపు లేక
రామగిరధామ! శ్రీరఘురామ! రామ!  ౭

ఖలులు పాశ్చాత్యులు గావించినట్టి జ
　　ల్యన్వాల బాగ్ హత్యల దలపించు
హత్య లయోధ్యలో నతి దారుణంబుగా
　　కల్గుట కట నేత్రుకారణంబు
ఆ తెల్లవారల నతి వంచనలమించి
　　వంచించి ప్రజ గించ పరచినారు
చెడుత్రోవ బ్రజ సాగ జేసెడి నేతలు
　　ధరణిలో ప్రజల భూతాలు నీరు
కుల మతంబుల జాతులన్ కలత పరచి
భరతమాతను కాటేయ బరగినారు
ఇట్టి ధూర్తుల నోర్చెద పెట్టులయ్య!
రామగిరిధామ! శ్రీరఘురామ! రామ!  ౮

మతములానాడిల మనుజుల విడదీసి
        ఐకమత్యము నూడ్చి యార్పె ననుచు
సమ సమాజములను స్థాపింతు మని చెప్పి
        ఇల నిల్పి నారు పార్టీల జాల
సిద్ధాంతముల జెప్పి చేయరొక్కటినైన
        క్రమశిక్షణ ల నంట గలిపినారు
స్వార్థ ముప్పొంగ హింసా రిరంసులు నయి
        కుటిల నాయకులెల్ల గూడినారు
పార్టిపేరున ప్రజలను పాడుచేసి
మమతలన్ బాపి భారతమాతృగర్భ -
మునకు పెనుచిచ్చు బెట్టిరి మూఢులగుచు
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౯

సత్ప్రజాసామ్రాజ్య సరళిలో స్వచ్ఛత
        ధార్మికస్వేచ్ఛలు తగుల బడియె
క్రమశిక్షణల్ గూలె విమలనైతిక ధర్మ
        సన్మార్గముల గంప చరచబడెను
హింసారిరంసతో హితమైన నాయక
        మ్మన్యత్వ మనని బెంపయ్యె మిగుల
స్వార్థపిశాచి లంచాల వీధుల లోన
        విలయ తాండవ మాడె విఱ్ఱవీగి
జాతి కుల మత ప్రాంత భాషాదులందు
ద్వేషముల రేపి తమ స్వార్థవిధుల కొఱకు
కుటిల నేతృత్వములు నేడు కొల్లలయ్యె;
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౦

నవతలే పెరిగె మానవతలే తరిగెను
హింసలే యెదిగె నహింస యణిగె
అర్థమే వెలిగె నిస్వార్థమే మలిగెను
స్థితిమారె ధర్మ సంస్థితులు జారె
గతిదప్పెనరుడు సద్గతులకు వెలియయ్యె
స్వార్థమ్ములే యర్థవంతమయ్యె
మతులేమొమాసె సమ్మతముల గతి మాసె
ఖ్యాతులారెను నపఖ్యాతి మీరె
నతములయ్యెను గుణము లున్నతములయ్యె-
దుర్గుణంబులు; గననేడు దుర్విధములు
విధులుగా మారె; ప్రభుతలో విలువ లూడె;
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ !  ౧౧

పదవులకై పాటు పడు నీతిబాహ్యుల
హేతువునస్ స్వార్థహింస లెదిగె.
శాంతి ధర్మ2హింస సమతాధిదేవతల్
మేదినిన్ నిలువక మృగ్యమయ్యె
అవినీతు లన్యాయ మక్రమ మార్గాలు
అధికారమూనె దేశాన నేడు
ధనకాంక్ష;దుర్విదగ్ధత, లధికారదు-
ర్వ్యామోహములె దేశపటిమ నూడ్చె
స్వార్థముల్ మీరె హృదయాన, స్వచ్ఛతెల్ల
బాసె నడతన; యీనాటి ప్రభుతలందు
అందుచే దేశమున నిమ్మళమ్ము లేదు
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ !  ౧౨

అధికారమేకాని యనధికారమెకాని
తనవిధిన్ మానె బాధ్యతల మఱచె
దేశాభిమానముల్ దీపించునాయకుల్
పరకింప పచ్చకప్పురమె య్యెరి
అక్రమ మార్గాల నవినీతి పన్థాల
ప్రజయు ప్రభుత్వాలు భ్రమసి సాగె
అభ్యుదయముపేర నప్పులే యధికమ్మై
స్వాస్థ్యదేశము ఋణ గ్రస్థమయ్యె
హెచ్చు తగ్గుల వర్ణాల చిచ్చులోన
మధ్య తరగతి జను లెల్ల మాడినారు
పాడు పార్టీల భేదాలు ప్రజ గలంచె
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౩

సత్యమే యణిగె యసత్యమే యెదిగెను
మనిషినే మనిషి సమాధి చేయ
ధర్మమే తరిగె నధర్మమే పెరిగెను
మెండుగా స్వార్థమే తాండవించ
న్యాయమే కృంగె నన్యాయమే హెచ్చెను
శఠ కపటంపు దుష్పథము సాగె
నీతి గ్రుడ్డిదె యవినీతి కన్నులు విచ్చె
దౌష్ట్యదుర్విధి చెప్ప దగ్గ దయ్యె
కలుష మారణ విజ్ఞాన ఘనత యెదిగె
దేశమున నేడు విపరీత తెలివి మీరె
శాంతి జీవన విజ్ఞానసరళి తగ్గె
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౪

సత్యధర్మా2హింస శాంతిసుశ్రీలకు
లేదు స్వాతంత్ర్యమ్ము లేశమైన
అన్యాయమప్రమాణాది దుర్విధులకు
స్వేచ్ఛా విహారాలు హెచ్చె నేడు
నైతికమౌవిల్వ నడివీధి బడికూలె
అవినీతి విలయతాండవము లాడె
మానవులందెల్ల మానవత్వములూడె
దానవత్వమ్ముల దౌష్ట్యమెదిగె
బహుళ దుస్స్వార్థమయ ప్రభుత్వాలు వెలసె
వీని నరుకట్టు ధార్మిక వీరులెవరొ
నేడు కరువైరి, యీ నేల బీడు వడెను
రామగిరధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౪

కాంచ నెచ్చోటున కనివిని యెరుగని
ద్వేష దుర్మత గర్వ రోష మెదిగె
కుల-మత-జాతుల గూల్పు ద్వేషముహెచ్చె
ప్రాంతభాషాద్వేష పటిమ రెచ్చె
అన్యసంస్కృతులపై నాదరంబులు మించె
తన సంస్కృతులపైన తగ్గె విలువ
ఆక తాయితనాల యాధిపత్యములాయె
సుజనుల పెత్తనాల్ శూన్యమయ్యె
మనిషి మనిషిని వంచించి మనుటలాయె
మంచి నెంచుచు మనిషితో మనుట పోయె
జనులు జనపతు లిటు లుండ శాంతికూలె
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౬

వర్ణ విద్వేషాలు ప్రభుతలో ప్రజలలో
కూడెను స్వార్థమ్ముతోడురాగ

పూనిసన్మతముపై బురుదలు జల్లుచు
కుమతులు హింసతో గులికినారు
క్రమశిక్షణలులేని విమలసంస్కారముల్
వరలనినేతలే ప్రజకునేడు
అధికారదాహులు నాసురీసంపదుల్
ప్రభుతలోనుద్యోగపరులుచాల
పదవిపై చాలపడిచచ్చు పతితకుమతి;
దోషులై పాపపుణ్యాల ద్రోసివేసి
కారుమబ్బట్లు దేశమున్‌గ్రమ్మినారు
రామగిరిధామ! శ్రీరఘురామ! రామ! ౧౭

ఏచ్చోటవాగాంచిన హీనాతిహీనమౌ
హింసారిరంసుల హింసలెదిగె
ఏనేల గన స్త్రీల మానాభిమానాలు
కూలిన యార్తనాదాలమ్రోత
ఏచాయ గనగ పైశాచికత్వాలన్ని
ఖలనాయకుల జేరి కాంక్షికించె
ఏవైపుజూచిన హృదయవిదారక
నరమేధముల తీవ్రతరపు హోరు
ఎటుగనుంగొన రక్షక భటులకైన
రక్షణలు లేని హత్యలు కక్ష లెదిగె
రాజకము గాదు దేశమురాజకమ్మె
రామగిరిధామ ! శ్రీరఘురామ ! నేడు ! ౧౮

పాపిష్ఠి సొమ్ముకై పరదేశప్రభుతకు
అభ్యున్నతులకని యదను జూచి
బానిసతనమూడి పదినాళ్లు కాలేదు
దేశమున్ తాకట్టు దిగిచినారు

ప్రజల బాగోగులకై పంచిన ధనమెల్ల
క్రూరకామందుల కొంప జేరె
కోట్లను వెచ్చించి యోట్లను గైకొన్న
కుటిలనేతృకులాన కొంత చేరె
కలసి వచ్చిన ప్రజ రోజుగారు ధనము
తీరు తీరుగ పప్పు పలార మాయె
ప్రజల నోటిన (1) మన్నాయె ప్రభుత గనదు
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౯

రాజుల కాలమ్ము రాయిరప్పుల పాలు
నేతృత్వములు నేడు నూతిపాలు
అధికారమానాడు నాడంబరముపాలు
బులినేతలిట కల్లబొల్లిపాలు
గ్రామపెద్దలునాడు కలముపోటులపాలు
పంచాయతుల్ తగవు బెంచుటాలు
ఉద్యోగులానాడు నూడిగమ్ములపాలు
నేటియుద్యోగి దుర్నీతిపాలు
ప్రభుతలీనాడు బలమున్నవాని పాలు
జనులు వంపెటో వరదటు సాగుటాలు
నేటి నేతల మాట లే బూటకాలు
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౨౦

పాటిదప్పని నేతృపాలన మానాడు
పాటిదప్పిన ప్రజాప్రభుత నేడు
తొటిమానవులెల్ల తోడు నీడలు నాడు
మాయియై మనిషి కాటేయు నేడు
చుట్టపక్కాలలో గట్టిప్రేమలు నాడు
కొరగాని మెఱుమెచ్చు కూర్మి నేడు

(1) దుమ్మాయె

అన్నదమ్ములలో ననురక్తులానాడు
పనులెల్ల తీరెడి వరకె నేడు
గడనయున్నంత వర కాలి కాంతు గనును
గడన లుడిగిన కావలి కాడె యనును
ఘనత లివి చూడ నీనాటి గాలమందు
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౨౧

ఒక సువర్ణాక్షుని నొంచితి వానాడు
స్వర్ణాక్షులిట నూర్లపైన నేడు
ఒకస్వర్ణకశివుని నూడ్చితివానాడు
సార్థక శివులు వేలపైననేడు
ఒకదశకంఠుని నొగి చంపితివి నాడు
లక్షల దశకంఠులైరి నేడు
ఒక్కమైరావణుంనుసురూడ్చితివి నాడు
మైరావణుల కోట్లు మసలెనేడు
వారికై శ్రమ నెంతగా వరలినావొ
తెలి మీనాడు; వీరలన్ కలుషమైన
వీరిదుష్కృతి నూడ్తువేతీరు ? స్వామి !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౨౨

ఖరదూషణాదుల ఖండించితివి నాడు
వరలిరి నూర్లపై వారు నేడు
త్రెంచితివపుడు మారీచసుబాహుల
వారు వేలుగ గల్గినారు నేడు
కూల్చితివతికాయకుంభకర్ణుల నాడు
వారు గల్గిరి కోట్ల పైన నేడు

వేద భూమిది కాదు దుర్వాదదనుజ
ఖలుల భూమిగ మీరెను తెలిసి నావె ?
ఎట్లు తొలగించెదవొ? వీరి నెఱుంగలేను;
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౭౩

ఆగమంబుల తీరు లాగమాగంబాయె
        కబళింప నవర సంకర దనుజులు
ధర్మముల్ జారె నదర్మముల్ మీరె నా
        చార మారెను దురాచార మెదిగె
ధర్మ స్వరూపులౌ తమరి జాడలతీరు
        లిల తారు మార్గాచు తెలియవాయె
ఏకత తత్వమనేకత్వ తత్వముల్
        సగుణ నిర్గుణముల స్థాయి తప్పె
జ్ఞాన శూన్యులు బాహ్య విజ్ఞానఖలులు
నిబిడ మాలిన్యమున మనోనేత్రమణగ
స్వామి ! నిన్గనరిల హేయ (తు) వాదఖలులు
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౭౪

మనిషేమొ యెదిగెను మనసేమొ తరిగెను
        మనసులోగల మేటి మమత తరిగె
చదువులే యెదిగెను సంస్కారమణిగెను
        సంస్కార మార్గాన సభ్యతుడిగె
విజ్ఞానమే మీరె వినయాదులే జారె
        అతిప్రజ్ఞలే హెచ్చె మతులు చచ్చె
పర నాగరకత పెంపందె స్వదేశీయ

ప్రకృతి సంస్కృతి నాగరకతలూడె
శోధనలు మీరే సత్యసంశోధనారె
నేటి కలికాలమున సాటి పోటిలేక
దుర్విధానము లీనాడు నుర్వి వెలసె
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౫

చెట్టుకుమూలంబుగట్టి కూకటివేరు
(1) భరతజాతికి మూలపటిమ పడతి
పడతివిల్వలు నేడు పడిపాయె వీధిలో
మానావమానాల మగువ కమరె
పడతికి పడతియే ప్రబలమౌ శత్రువు
మెట్టినింటన సతుల్ మట్టిపాలు
పైసకమ్ముడుపోయి పడతి యీ నాడిల
పడతి గర్వము (గౌరవమూడి) లూడి పడగజేసె
పడతికన్నీరు చెఱువాయె పుడమి కుమిలె
పతుల బ్రతులు పడికూలె సతులు నేడ్వ
నేటి భారతమున నారి నీతి మాలె
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౨౬

సత్యంబు ధర్మంబు సారహీనము లయ్యె
కన నసత్య మధర్మమనగ హెచ్చె
మానవతా ధర్మ మర్యాదలడుగంటె
దుర్దానవోద్ధతి తూలియాడె
న్యాయ నీతులు నేడు నడిబజారున చచ్చె
అన్యాయ మనినీతి యతిగ నించె

(1) జాతికి మూలంబు నాతినిలువ

జాతి సంస్కృతి సభ్యతాదులు నడుగంటె
        పరకీయ సంస్కృతి ప్రబలిహెచ్చె
పరమధార్మిక భారత పథములందు
బరుసు కంపలు నాటగా పథములదరె
వేదధార్మికభూమి యివ్విధములా యె
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౨౭

స్వామి !యేమని చెప్పజాలు దీదేశాన
        దౌష్ట్యదుస్స్వార్థ కృత్యాల హోరు
ప్రభుతలో ప్రజలలో పాపభీతేమాసే
        రౌద్ర దౌర్జన్యాలు రాజ్య మేలె
ప్రభుత కాలమునకు ప్రబలకారణ మాయె
        కాలంబు ప్రభుతకు కారణంబు
ఈ నాటి ప్రభుతలో నెనలేని కాలంబు
        కర్కశ కాలమై కాంద్రికించె
ఏమి విపరీత మియ్యది యెఱుగలేను
కాలమే నీవు నీవేయీ కాలముగద!
సర్వమెరుగుదు నీవెనేఁ జాట నెవడ
రామగిరిధామ! శ్రీరఘురామ! రామ! ౨౮

ఏ వైపు జూచిన నెనలేని హింసలు
        నరమేధములు ననంతాలు నేడు
దోపిడీ దొంగల దుర్విహారాలయ్యె
        ప్రజల రక్షణ నేడు భగ్నమయ్యె
రక్షక భటులకే రక్షణల్ కరువాయె

నేతల దుండగాల్ నీతినార్పె
సత్యధర్మా2హింస శాంతి దేవత లెల్ల
కాలూన కిటనుండి కదలినారు
మనుజులకు భద్రతలు నిట మరుగుపడెను
ప్రభుత లున్నట్ల ? లేనట్ల ? భ్రాంతి కలిగె
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౨౯

దైవ మనుకూలింప తమ విధుల్ ఫలియింప
ప్రజలుమేమని ప్రగల్భముల నాడు
దైవంబు వ్యతిరేకతనుగల తమవిధుల్
తాము నను పడికూలు తథ్య మిదియు
అల దశాస్యుడు దురహంకారియై సాగె
విధి వెగటైన తా విరిగి కూలె
కాలంబుసరిపడ గడు తెంపరై నరుం
డెగసి నాయంత వాడెందు లేడు
అనుచు విఱ్ఱవీగు నతడు నాసమయము
ప్రతిఘటింపకూలిపడి నశించు
కాలపురుష నిన్ను గనరయా నరులిల
రామగిరివర ! రఘురామ ! రామ ! 30

ఎంతవారైనను నెట్టి వారైనను
దైవానుకూలతన్ దగచరింత్రు
దైవంబు వ్యతిరేకతల్ మీర వారలు
హీనులై పోవగా గానలేమె ?
స్వార్థుడై నరుడిల పాప భీతిని మాని
ప్రజలను హింసించి బ్రతుక నెంచు

వాడెంత కాలమ్ము వసుధ వర్థిల్లనో
ఆత్మపరిశీలన మరయ లేడు
దాంతియైనను సకలవేదాంతియైన
రాజె యైనను బంటైన నీ జగాన
దైవగతిదప్పిపోలేరు తథ్య మిదియు
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! 30

సకల చరా2చర జగతిలో నంతట
వ్యాపించియున్న మాప్రభుడ వీవు
సృష్టి స్థితి లయాల చెప్పకుండనె చేయు-
హేలా విలాసాల కాల మీవు
భవితవ్యతా2తీత వర్తమానాలకు
నందక హేతువై యుందు వీవు
మంచి చెడ్డల పనులెంచి చేయించెడి
ప్రకృతికృత్యమ్ముల వికృతి వీవు
సాగు మీదైన యా జ్ఞానుసార మిట్లు
లోక; మెఱిగింప మీకు నేనా ? కనంగ
సర్వమెఱుగుదు వీవు శ్రీశా! క్షమింపు;
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! 31

సర్వమై నిలుచుచు సర్వమున్ గనువాడ !
సర్వ కాలము లందు సాగువాడ !
సర్వ ప్రాణులలోన సాక్షివై మానస -
సత్స్వరూపుడవైన సత్స్వభావ!
జగతికి చక్షులై సాగు సూర్యేందులు
నీకు చక్షువులౌచు నిలిచియుండ

పంచభూతంబులు బలువైన కాలముల్
సాక్షులై నుర్విలో సాగుచుండ
నీవు తెలియవటంచు నేనేమొ నీకు
తెలిసి నట్టుల మూఢునై పలికి (నాను) తంత
నీ యభీష్టము తీరె, మన్నింపు నన్ను
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ !

శ్రీరామగిరి - శ్రీరఘురామశతపారిజాత ప్రబంధమున

శ్రీరామగిరి - శ్రీరఘురామునికి విన్నపములు - అను

షష్ఠమ గుచ్ఛముసర్వము శ్రీరఘురామ

పాదపద్మార్పణమై ముగిసినది

ఇతిశమ్

-: శ్రీశుభంభవతు :-

## శ్రీః

## శ్రీసీతారామాభ్యాంనమః

## శ్రీరామగిరి - శ్రీరఘురామశతపారిజాతము

## -: శ్రీరామగిరి - రఘురాముని - వినుతి - సప్తమగుచ్ఛము: -

''శ్రీరామయని తొల్తచేర్చక హైందవ
భారతీయులు వ్రాయలేరునెదియు
''శ్రీరామ! కలవునీవేరా! యనకయేది
వ్రాయరు తెల్గు లౌ వార లెందు
రక్షించు వాడిల రాముడే దిక్కంద్రు
తెలుగు సంస్కృతిల్లు తెల్గువారు
రామలాలీ ఘన శ్యామలాలీ యని
బాలకు తెలుగమ్మ జోల పాడు
ఇంపుగా జుంటి తేనె జుర్రింపజేయు
నామ - గుణ - రూపముల చవి నమరియున్న
రామ ! మాతండ్రి ! వినుతింతు రక్ష నిడవె
రామగిరిధామ! శ్రీరఘురామ ! రామ ! ౧

''శ్రీరామ !యనినంతనే; రాలు పాపాలు
భవ రోగ కోప తాపాలు కూలు
''జయ జయ రామ ! శ్రీజయరామ !'' యనిన జాలు
కాలురా ! రాగ రోగాలు వేలు
''రఘుపతి రాఘవ రాజరామన జాలు
పాయును షడ్రిపు భవ భయాలు
''పతితపావన !'' యని మతిగల్గినన్ జాలు
భగ్నమై పోవు తాపత్రయాలు
మహిమ లెదగిన రామనామాలు వేలు
గలిగి చెలువారెదవు స్వామి! గరుణ నేలు

రామ ! సీతామనోభిరామా ! మనోజ్ఞ-
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౨

ఎలుగెత్తి మనసార "శ్రీరామ !" యనినంత
కాలిపోవును రుజల్ ; కూలు చింత
"కావవే నా పాలి దైవమా ! యనినంత
రక్కసి రిపు భయాల్ రావు (చెం)పొంత
"రావణాంతక ! నన్ను రక్షింప" మని నంత
పాయును రిపుషట్కభయములంత
"దనుజమర్దన ! రామ ! దయజూడు"మనినంత
ఇలఁగలి పడికూలు నింత లింత
ఎంచి శ్రీరామ ! యనుచు చింతించి నంత
కరగిపోవును భవపు చీకాకు లింత
అనుచు నిన్ జేరితి నిబ్రోవరా ! యనంత !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! 3

ఏపూర్వ పుణ్యమో యెదగ నిన్ మది నమ్మె
అపహృత మాయె షడ్రిపుల సమ్మె
నీ నామ మహిమల నెదనిల్పుకొన సొమ్మె
తలచినన్ నిను మది కలిని జిమ్మె
పరగ నీ నామ జపంబులు నెదగ్రమ్మె
ఘాటైన వైరుల నోట దుమ్మె
నిను నమ్ముకొను వాని నిజమైన ధర్మమ్మె
దైవమై కన గూలు తామసమ్మె
పరగ నీమూర్తి యెదన సంభావనమ్మె-
య్యైన నానంద సందోహమానసమ్మె
అగు ననుచు నిన్ను దలపోతు నయ్య ! రామ !
రామగిరి ధామ ! శ్రీరఘురామ ! రామ ! ४

శ్రీరామ ! యని నిన్ను చేరితి నోయయ్య !
రక్షింతు వంటిని రాములయ్య !
రాగరోగాదులు రక్కసులైరయ్య !
కోదండమున బడ గూల్పవయ్య !
వెరపించి షడ్రిపుల్ పెనవేసినా రయ్య !
బరిమార్చి నన్ను కాపాడవయ్య !
తగని భవాబ్ధిలో దబ్బిబ్బు లయితయ్య !
దరిజేర్పవయ్య ! నీ దాసునయ్య !
నిన్ను దప్పన్యమును మదిన్ నిలుపనయ్య !
నీ పదంబులె ప్రాపని నిలిచి తయ్య !
ఇహము రోతయ్యె పరము నందింపు మయ్య !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౫

శ్రీరామ ! శుభనామ ! సీతారమాఽరామ ! సద్గుణస్తోమ ! వాత్సల్యరామ !
శరణాగతత్రాణ బిరుదభూషణరామ ! కోసలరామ ! వైకుంఠరామ !
శ్రితజనాఽవననామ ! శ్రీకరహృత్సీమ ! జలధరశ్యామ ! దుష్కృతిహరామ!
దశరథరామ! భద్రాద్రి శ్రీజయరామ! ఆర్తరక్షకనామ! అసురభీమ!
విబుధ బుధ మౌని జనను త విజయరామ !
దండితారాతి దైత్య దోర్దండ రామ !
దరికిజేరితి బ్రోవు కోదండ రామ !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౬

శ్రీ రామచంద్ర ! ఓ శ్రిత పారిజాతమా !
మునిమనోకైరవ పూర్ణసోమ !
జానకీ ముఖ పద్మ చంచరీ కోత్తమా !
హిత పారిజాతమా! వితతనామ !
విశ్వకల్యాణకృద్వినుత సుందర రామ !
శోభాయమాన గుణాభిరామ !

శరణన్నవారిని కరుణించు హృదయమా !
ఆర్తజనా2వన హస్త పద్మ !
స్వామి ! సీతాపతీ ! నిన్ను శరణమంటి
కరుణ లెదగాడ దాసుని కనికరించి
కావుమంటిని, లేదు దిక్కంటి నయ్య!
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౭

శ్రీరామ ! కళ్యాణ సీతారమా 2 రామ !
కారుణ్యగుణసీమ! కలివి రామ !
చారుశ్రీకువలయ శ్యామసుందర ! రామ !
సజ్జనావననామ ! సత్యకామ !
రామ ! శ్రీదశరథ రామ ! రాఘవరామ !
జనకరాడ్వినుత సౌజన్యరామ !
శరణన్న రిపునైన కరుణ నేలెడి రామ !
చారుశ్రీధర్మావతార ! రామ !
సాధు భక్తావనైక వాత్సల్యరామ !
రమ్యవైకుంఠరామ ! భద్రాద్రిరామ !
వినతుడను నన్ను గనుమంటి విజయరామ !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౮

రామ ! శ్రీసుగుణాభిరామ ! రాఘవరామ !
శరణాగత త్రాణ పరమ సీమ !
ఉమకు నుమేశుండు నుపదేశమిడిన శ్రీ
సన్నుత నామ ! కౌసల్యరామ !
కారుణ్యగుణ ధామ ! కైవల్యపదసీమ !
తారకబ్రహ్మమై తనరు రామ !
భవభయాంతకనామ ! పావన గుణసీమ !
కీర్తితనామ ! కైకేయిరామ !

మిత్ర వంశాబ్ధిసోమ ! సౌమిత్రరామ !
పరమ పదప్రాపకోన్నత భద్రనామ !
రామ ! శరణంటి వేంకటరామబ్రోవు
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౯

నీ కథ యన్నది నిగమాంతరూపమ్ము
ప్రాచేసోద్భవ భవ్య గంగ
విశ్వభారత నభోవీధిలో విహరించు
పరమవిజ్ఞాన భాస్కర సుకరము
మోహాంధకారమ్ము బూర్తిగా దొలగించు
తాపత్రయేషణ త్రయము బాపు
విశ్వాసచిత్తులౌ వినుతసద్భక్తుల
చిత్తశాంతిని గూర్చి శ్రీల నొసగు
ఎదన జ్యోతిని వెలిగించి కదలలేని
కలుష మూఢాంధకారమున్ తొలగజేయు.
ఆ కథా నేతవౌ నిన్నె యాశ్రయింతు;
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౦

తినుచున్న యన్నమే తినుచుండు జీవుడు
అది ప్రతి రోజు క్రొత్తందనమ్మె
చేయు సంసారమే చేయును జీవుండు
అది ప్రతిరోజు క్రొత్తందనమ్మె
వినిన నీకథలనే వినుచుండు మనుజుండు
వినినప్పుడది క్రొత్త (1) వెలుగుటోయు
బ్రతికున్నవర కన్న పాన మసహ్యమ్ము-
కాదొక వేళైన కాటిచూపె
తనువుకలదాక నీ కథల్ దలచి వినిన
విసువు కల్గదు కల్గిన వీడు నిహము

సత్య మిది యని నమ్మిన స్వర్గ మమరు
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౧

మనిషి యన్నము లేక మనలేడు నెందున
జనున కియ్యదియు నసాధ్యమగును
ఇలభవత్కథ నాశ్రయింపక నేకథల్
ఉండు టన్నది వట్టి మొట్టిముంత
భవదీయ కల్యాణ భరితమౌ సత్కథ
లేక యేకథ కిల లేదు విలువ
(2) నీ చరిత్రే లేని యెందే చరిత్రైన
భారతీయుల ధర్మ పథము లేదు
జగతి నీ మాట యక్షర సత్యమయ్య !
భారతీయత; విశ్వైక భారతియును
స్వామి ! లేదయ్య; భారతజాతి లేదు
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౨

వివిధ దేశములందు వెలిగుంద్రు సుత కళ
త్రాదర్శమిత్ర బాంధవులు నెపుడు
ఆప్తులు ననుకూలుర నవద్య సద్బుధుల్
ప్రభుతలు ప్రజలెల్ల బరగుకాని
అన్నికాలము లందు నన్నియుగా లందు
అన్నిజాతులయందు నన్ని తీర్ల
ఆదర్శ మూర్తులు ననుకూల వర్తులు
అనురాగ మూర్తులు ననఘమతులు
పరగ మీవంటి మీసహోదరులవంటి
స్నేహశీలురు లే రిల; సీతవంటి
సాధ్వి, గనలేము నిజమిది సాధుచరిత !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౩

(1) వింతదోచు (2) నీచరిత్రేలేకలేదే చరిత్రైన

పితురాజ్ఞపాటించు విజ్ఞుడెవ్వండన
శ్రీరాముడని తొల్త చెప్పుచుండ్రు
అన్నసేవలయందు నంకితు డెవడన్న
సౌమిత్రి యని తొల్త చాటుచుండ్రు
ఆదర్శసోదరుల వనిలో నెవరన
శ్రీరామలక్ష్మణోదారు లంద్రు
ఆదర్శ గృహిణిగా నీధర నెవరన్న
సీతమ్మయేమని చెప్పకొంద్రు
ఇట్టి మహనీయు లిలలోన నెవ్వరన్న
మీరు దప్పన్యులెవ్వరు లేరులేరు
అయ్య ! మాపాలిదేవతలయ్య! మీరు
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౪

శరణాగతత్రాణ బిరుదుడెవ్వండన
ప్రేమాస్పదుండైన రామ విభుడె
కరుణాంతరంగుడై వరలు నెవ్వండన
సామరస్యతలున్న రామవిభుడె
శరణన్న రిపులను కరుణించు నెవడన్న
క్షేమప్రదుండు శ్రీరామ విభుడె
నమ్మిన భక్తులన్ వమ్మొనర్చ డెవండు
కామిత వరదుండు రామవిభుడె
ముని మనోహర సౌందర్య పురుషు డెవడు
ననిన శ్రీరామచంద్ర మోహనుడు ననుచు
తెలుప భక్తులు నిను నమ్మి కొలిచినాను;
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౫

బ్రహ్మ రుద్రేంద్ర దిక్పతు లాదు లెవ్వనిన్
దివ్యసూక్తులచే నుతించుచుంద్రు
పద - ఝట - ఘన - పూర్ణ పరమోపనిషదాగ
మములు నెవ్వని గీర్తనములు సేయు
ధ్యాన యోగంబుల దవిలిన మదిగల్గి
కాంతు రెవ్వనిని యోగా ధిపతులు
పలు సురాఽసుర సంఘములు పేర్మి నెవ్వని
ఆద్యంతముల నింత నరయలేరు
ముగ్ధమోహన త్రిభువన మూర్తియైన
అట్టి మహనీయ మూర్తి వీవనుచు నిన్ను
పేర్మి గొలుతును కరుణింపవేర ! రామ !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౬

శ్రీరామ ! రఘువంశ శ్రీరత్నదీపమా !
కారణములు లేక ఘనతగలుగు
లలితార్ద్ర మార్ద వ కలితామృత సమాన -
భవదీయ కల్యాణ భరితమైన
సత్కృప లెవనిపై సాగుచు నుండునో
వాడభివృద్ధిని వరలుచుండు
మూగనైనను జేయు పూర్ణ వాచాలుగా
కొమరొప్ప నడిపించు కుంటినైన
స్వామి ! మీ నామజపమున సాగువా డు
ఇహ పర శ్రీల సుఖముల నెదగు ననుచు
నమ్మి యెద నిన్ను నతిజేతు నెమ్మి బ్రోవు;
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౭

పరమ పదంబునన్ బరగ వసించిన౯
భక్తుల మొరవినంబరగననుచు
నారాయణా ! మీరు క్షీరార్ణవము వీడి
నాగపర్యంకము నవల ద్రోసి
పటుశంఖ చక్రముల్ భరత శత్రుఘ్నులై
ఫణిపతి లక్ష్మణ స్వామి గాగ
శ్రీమహాలక్ష్మియే సీతయై చెలువార
శ్రీరామ చంద్రులై చెలగి మీరు
లలిత సాకేతపురమున కొలువుదీర్చి
భక్తులన్ గావ వెలిసిన పరమపురుష !
ఎంత కారుణ్యసింధువో యెరుగ నిన్ను;
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౮

చిన్నారి సీతమ్మ చిరు నవ్వుమోము చం -
దురు వెన్నెలలయందు మురిసి యాడు -
కనుదమ్ములందు జాల్గొని చొక్కమైవెల్గు
చల్లని కనికరాల్ జాలువార;
ఎదలోన నిను నమ్మి ముదమార సేవించు
ప్రజ నేల దయ లెదన్ బ్రబలి యాడ;
ఇతర చింతలు మాని యెద నిన్ను గొలిచెడి
సాధులనేలు వత్సలత లూర
పరమ యోగుల మనములన్ మరులగొల్పు
నీలి మబ్బుల సొరులు నిల్పి యాడు
ముదము చెలువొందు నిను గొల్తు మదనరామ !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ !

శతమఖ మణికాంతి వితతవైభవ మేలు
తనువైభవశ్రీలు గునిసి యాడ
చల్లని కృపలీను పుల్లాబ్జ నేత్రముల్
చెంపకు చేరడై చెలువుమీర
ముద్దుల మురిపాలు ముసినవ్వు మోవిపై
లేత ముత్తెపు సౌరు లెగసియాడ
మురుపు లూరెడు మేల్మి గిరిజాల జుట్టున
లలితేంద్ర నీలాల తళుకులీన
కంఠమున వైజయన్తిక, కటినిబద్ధ -
కనక చేలము విలుతీవి కరమునందు
రక్తిజెలువొందు రామ ! నిన్ భక్తి గొలుతు;
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౨౦

శ్రీసతి కౌసల్య చెలువొందనోచిన
బంగారు నోముల పసిడిపంట
దశరథ భూజాని తగు నోర్మి జేసిన
యజ్ఞ షంజాత పాయసఫలంబు
జనకరాజ ఋషీంద్రు డనితర జ్ఞానియై
ఆచరించిన జ్ఞాన యజ్ఞఫలము
సీతామహాసాధ్వి చేసిన విలువైన
తొలిపేర్మిపూజల చెలిమిపంట
మిథిల సాకేత వాసుల మేలి మైన
తపము పండిన ఫలము మాజపఫలమ్ము
స్వామి ! నీవే యటంచు నే సంస్తుతింతు;
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౨౧
మాన్యులౌ భక్తుల మాలిన్యములగొని
ఎదమచ్చగాజేర్చి యెదగినావా ?

పరమ ప్రపన్నుల బాధల నెడఁ గింప
　　శ్రీని కౌస్తుభమున జేర్చినావొ?
ఆసురీసంపదన్ హరియించుటకు మేటి
　　పాంచజన్యంబు చేపట్టినావొ?
కలుష సంస్కృతిగల్గు ఖల రాక్షసుల గూల్ప
　　ఘనసుదర్శనమును గలిగినావొ ?
భరతవర్షాపహారులౌ దురితరిపుల
సమయజేయగ కోదండ మమరి నావొ
ఇటుల మాపైన నీకృప లెదొగె నేమొ ?
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౨౨

మీ భవ్య నామాలు మా భోగభాగ్యాలు
　　భవ రోగ సంతాప భంజకాలు
మీ దివ్య రూపాలు మేదినీ దీపాలు
　　భక్త మనోబ్జాల భాస్కరాలు
మీ స్వాదు గానాలు భాస్వదానందాలు
　　దారుణపాప సంహారకాలు
మీ పాద దాస్యాలు తాపాపహారాలు
　　సన్ముక్తిసోపాన సత్పథాలు
మౌని చిత్తాబ్జ సుందర మందిరాలు
మీ నివాసాలు; మాకైన మీ పదాలు
సర్వసంరక్షకాలని స్వామి ! దల తు;
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౨౩

మీ దివ్య చరితమే వేదవిజ్ఞానంబు
　　వేదవేద్యుడవైన విభుడ వీవె
స్వామి ! మీ మహిమలే సకల పురాణాలు(1)
　　పరమ పురాణ సత్పురుషు వీవె

(1) కధలెగా

భవదురు జ్ఞానాలె భువి నితిహాసాలు
ఐతిహాసిక చక్రవర్తి వీవె
వరద ! మీ గుణవైభవమె మహా కావ్యాలు
ఆది కావ్యైక నాయకుడవీవె
తావకీనోరు భక్తసంత్రాణ కథలు
(1) భారతీయోరు దివ్య ప్రబంధకథలె
మీరు మీకథలి ల భవ తారకాలె
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౨౮

ఆర్తులౌ భక్తుల నాదరించుట కీవు
అభయప్రదాయివై యలరినావు
ధూర్తులౌ నాసురీ దుర్మార్గులకు నీవు
అతిభయంకరుడవై యమరినావు
భవవిషా హినిబద్ధ భుక్తులన్ రక్షింప
ఖగరాడ్ధ్వజంబును కలిగినావు
పాప దుర్మకరిచే బలిగాను సుజనులన్
కాపాడ చక్రమున్ గలిగినావు
బాణ బాణాసనంబులన్ పాపరిపుల
గూల్ప చేపట్టినావు- నీ; గొప్పదనము
తెలియతరమౌనె యేరికి ? కలుషహారి !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౨౯

అజ్ఞాన నిశి నూడ్చి విజ్ఞాన భానుని
వెలిగింప బుట్టినా వినకులమున
ప్రజల దారిద్ర్యదావాగ్నుల జల్లార్చ
గంగకు తండ్రిగా గలిగినావు

(1) పరమ ద్రావిడ దివ్య ప్రబంధకథలె

సురవైరులన్ గూల్చి సురులను రక్షింప
కల్పవృక్షంబు గాగలిగినావు
భక్తియోగుల కోర్కె బాలింప జింతామ -
ణైన కౌస్తుభ మెద నమరినావు
పరమభక్తుల బాలింప ధరణిజాత-
కూర్మి నర్థాంగిగా జేసికొంటి వీవు
దేవ ! మీవైన ధర్మాల దెలియగలమె ?
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౨౬

స్వామి ! మీరిట ధర్మ సంస్థాపనల్ చేయ
బహులావతారాల బరగి మిగుల
దుష్టులౌ రావణాదుల ద్రుంచితిరి, వారి -
నిలరక్కసులుగ బుట్టింపనేల ?
మొదట సుజనుల గా పుట్టజేసిన మీకు
వెలితేమికలుగును ? తెలియలేను;
తెలియు; నీ చిత్తవృత్తుల తీరు, భక్తితో
దేవ తిర్యఙ్నర స్థావ రాది-
సకలజీవులు నిన్గని సుకృతమొంద -
వలయు నను మేటి యుపకార పరమ బుద్ధి
(1) ఔను కాబోలు: శరణం మాయయ్య ! నీకు
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౨౭

రత్నాకరంబులై రహి వెల్గు వేదాలు
అర్థసంపద లభేద్యంబులయ్య !
ఘంటికా2 ఖేటక ఘనులె పురాణాలు
పలుతీరు లర్థాల భ్రమలు గొల్పు
ఇంద్రజాలంబులే యిల దానధర్మాలు
ఒకటిపదారౌను సుగతి నిడవు

(1) జౌనని దలంతు

సమయ మిది రార ! రామయ్య ! శరణమంటి;
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! 32

కలలోన నైన నవ్వులకైన భవదీయ
నామమున్ మాననో రామచంద్ర !
ఏ వస్తువైన మీ యెదుట బెట్ట క నేను
ఎవ్వారికిడనురా ! ఇనకులేశ !
ఏ మహాత్ములు నిన్ను నెఱి గింతురోయని
వారలన్ గొలిచితి వారిజాక్ష !
ఏ నాస్తికాధము లీసడింపగ నిన్ను
మనసు (1) గ్రమ్మై యుండు మైథిలీశ !
అరమరలు మాని భక్తితో నణగి మణగి
కొదవదీరని మమతల గోరి నిన్ను
శరణమని చేరుకుంటిని కరుణ నేలు;
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! 33

మనుజు డెందాక నేధనము నార్జించునో
అందాకనే హితుల్ బంధుజనులు
మిత్రులు పుత్ర కళత్రాది సోదరుల్
స్వజనులైన కుటుంబ సభ్యులైన
అర్ఘ్యపాద్యాచమనాది సేవల నెల్ల
సమయానుకూలాన సలుపు చుంద్రు
(1) వార్థక్యమున ధనంబా ! యింత లేకున్న
తూలనాడుచు వీడి దూరముంద్రు
(2) మోదమునవాఢ్యు నవకాశవాదులయ్యి
వాడుకొని పోటు పొడతురు పాటిదప్పి (4)

(1) తల్లడమందు (2) ముదుసలియైయుడుట్టు బూని తేలేకున్న
(3) మోదమొలికించి యవకాశ (4) పీడిపోయి

అట్టి స్థితి గల్గి చేరితి నాదు కొనవె
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! 3౮

ఊపిరి యెందాక నుండునో తనువులో
అప్పు డండలు సేమ మరయు చుంద్రు
అర్థవంతుడైన నందలు నాప్తులే
అడుగులకు మడుంగు లిడుచు నుంద్రు
ఆకొంచెమౌ ప్రాణ మారిపోవంగనే
కోరి యెవ్వరు దరిం జేరలేరు
భార్యా సుతాదులు భయభీతులై చాల
చెంతజేరగరారొకింతనైన
తెలియ డొక్కడు వీనివౌ స్థితి గతులను
నిక్క మిది లోకమున, నాకు నీవె దిక్కు
కరుణ గలిగుండు నాపైన; శరణమంటి,
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! 3౯

అర్థంబు గలదాక నాలుబిడ్డలు హితుల్
బాంధవుల్ సేవింత్రు ప్రస్తుతింత్రు
అర్థమ్ము గలదాక నాదరస్థితి యుండు
పేరు ప్రతిష్ఠలు వెలుగుచుండు
అర్థంబు గలదాక నజ్ఞాని యైనను
జ్ఞానులలో మేటి జ్ఞానుడగును
అర్థంబుగలదాక నధికారు లనధికా -
రుల చేత గౌరవంబులను గొనును
కనగ నర్థంబులేకున్న గంజిలోని-
ఈగవలె తీసివేయుచు నివతలింత్రు
ఇదియె లోకపు ధర్మమౌ నీశ ! నేడు
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! 3౬

తను మనోబల శక్తి ధనము లుద్యోగంబు
ఉన్నంతవరకె యీయుర్విలోన
అన్నదమ్ములు హితులాశ్రితుల్ బాంధవుల్
ఆలుఁబిడ్డలు మిత్రులైనవారు
స్తుతిపాఠకుల తీరు స్తుతులొనరించుచు
పలువిధంబుల జేరి వాడు కొంద్రు
అవి యెల్ల బలహీన మైనంతనే వారు
నీరింకినట్టుల దూరముంద్రు
అంతమాత్రమె కాదు నేరాల నెల్ల
మోపి మేలెంచకనె వెన్ను పోటు పొడిచి-
పోదు రీనాట, యిది నీకు మోదమగునె ?
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౩౮

పంచ భూతాలతో పంచవాయువు లుండి
భాసిల్లు దేహమున్ భ్రమసి చూచి
మధురమౌ హృదయము మమత బుద్ధియు తెల్వి
మురువూరు రూపున్న మురిసిపోయి
ప్రేమ ప్రేమని పల్కి ప్రేమార్థమెఱుఁగక
ప్రేమ ముసుఁగున పశుకాములగుచు
దైహికానందమే ధర శాశ్వతంబని
ధార్మిక విధులను దన్నివైచి
దేహబాంధవ్యములలోన దేలియాడి
ఆత్మసంబంధ బంధువీ వనుచు నరులు
నిన్ను గానరు స్వామి ! నన్నెంచకటుల
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౩౯

క్షణింబులైన నీ కనక కాంతాదుల
దుర్మోహములయందు దూలి తూఁగి
బ్రతుకుతెరువుకు పెంపగు విద్య ధనములఁ
వయసున సొగసున పాడి యాడి
మన్ను మిన్నెఱుఁగక సన్నుతింగలపెద్ద
పెద్దల హితములన్ రద్దుపరచి
వానకాలపు నీటి వరదల రీతిగా
పరవళ్ల ద్రొక్కుచు పరుగు లిడెడు
నరులు నారులు నెదురు లేనట్లు మిగుల
అరుగుదురు నేడు పెడదార్ల నాత్మ గనరు,
నిన్ను నీ ధర్మముల; నమ్మి నన్నుతింతు,
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౩౯

తను - ధన - బల శక్తి తవిలున్నవరకు న
న్నాభాసభాంధవో న్మాదు లెల్ల
పలురక్తసంబంధ బాంధవ్యులగువారు
(1) మధువునీగలయట్లు మసలి కూర్మి-
పశ్యతోహరులయ్యి పడి దోచి నిలువెల్ల
ఎంగి లిస్తరిని పారేసి నట్లు
శక్తియుక్తులు లేక రిక్తుడనౌ నన్ను
దోష మారోపించి ద్రోసినారు
నమ్మి వారల; బ్రతుకులో నమ్మనైతి
నెమ్మి నన్ బ్రోవువారలు నీవు దప్ప
లేరు లేరెవ్వరని నిన్ను చేరినాను
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౪౦

(1) తేనెలోనీగట్లు తేలికూర్మి

పలు కష్ట సుఖముల బాల్పంచుకొనుటకు
ఎవ్వరో నత్తురంచెదిరిచూచి
కలిమిలోనందఱు గలిగుంద్రు లేమిలో
కన రెవ్వ రని తెల్య గలిగి తిపుడె
నా ధర్మ మిది యని నమ్మిచేసితి గాని
నా కర్మమిదియని నమ్మకుంటి
నా తెల్వి లేమిని నరసితి నీనాడె
కాల జేతుల నాకు గలిగి నట్లు
నేటి కలికాల మిది యని పాటెఱింగి
ఎఱుగకుంటిని నీ సేవ మఱచి యుంటి
తప్పు మన్నింపు శరణంటి దాసు నేలు
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౪౧

సంప దాపద లందు సాయముండెడి వారె
రక్తసంబంధులు శక్తమతులు
కష్టసుఖములందు కలిసియుండెడివారె
అన్నదమ్ములు స్నేహ మున్నవారు
చీకటి వెలుగులన్ జేయి వీడనివారె
హితులు స్నేహితులును సతి సుతులును
పున్నమమావాస్యలున్న వేళల నైన
పలుతోడుపడువారె బంధుజనులు
చెఱువు నిండుండ కప్పలు చేరినట్లు
చేరు బాంధవులా వారు? చెనటులయ్య !
ఎఱిగియున్ నిన్నెఱుంగ మన్నింపుమయ్య !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౪౨

ఆభాస బాంధవులౌ వారలను నేను
ఆత్మ దైహిక బాంధవాదు లనుచు

భావి నీదెడి కప్పు వార్నిధే యిది యని
భావించినట్లు నే భావమందు
షడ్వర్గరిపులనే సఖులను కొన్నట్లు
నావారు వీరని నమ్మి యుంటి
ధన దేహ బలములు తారాడునందాక
తవిలుందురని యాత్మ దలచి తిప్పై
పరమ దేహాత్మ బంధు వీవనుచు నిన్ను
తెలిసికున్నాను నేటితో దెలివిగల్గి
నమ్మి నిన్ జేరి శరణంటి నయ్య ! స్వామి !
రామగిరిదామ ! శ్రీరఘురామ ! రామ ! ౪౩

అర్థమం దధిక మోహంబున్నవానికి
సర్వధా స్థిర సుఖ శాంతి లేదు
వేల యనర్థాల మూల మర్థమ్మురా !
అధికమౌ ధన మిల నాత్మహాని
ఆర్జించుటమునందు వ్యయము చేయుటయందు
పరికింప బలు దుఃఖ భాజన మగు
వచ్చినన్ పోయినన్ వ్యథలనే కలిగించు
తన పరవారితో తగులు భయము
అరయనిడుముల భాజనమ్మైన ధనము
కూడబెట్టిన ప్రాణమే (1) కూలుటగును
నీపద శ్రీల నే నమ్మి నిలిచినాను
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౪౪

మనుజుండు బాల్యమం దనువైన క్రీడలం
దాసక్తుడౌను నీదారి గనడు
పడుచుదనంబునన్ పడతి పుత్రులగూడి
భవమీదుచుండు నీ పథముగనడు

(1) కూలిపోవు

అరయ వార్ధక్యమందదియిది లేదంచు
కడు వస్తు కాంక్షియై కనడు నిన్ను
ఎప్పుడే సమయ మేదేని చిక్కిన గాని
ద్రవ్యచింతనుడె; నిన్ దలవ డెపుడు
వీనితో పాటు దాయల ప్రీతి గలిగి
తిరుగునే కాని నిన్నింత దెలియడయ్య !
సమయ మాయువులను నిట్లు సమయ జేయు
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౮౫

ఈ యాలి యీ సుతుల్ యీ బంధు మిత్రాదు
లెటనుండి వచ్చిరి ? యెవరు వీరు ?
తను విది పడిపోవ తన వెంట వత్తురా ?
ఒక్కడైనను గాని యెక్కడైన
ఎవ్వడో ? తా నిట కెటనుండి వచ్చెనో ?
ఎవరు పంపగ వచ్చె నెందుకొఱకు ?
నేను నాదనుకొని నీల్గుచుండునె కాని
నాది నేనను వాని కేది లేదు
ఈ విధంబుల గనక నిన్నింతనైన
తెలిసికొన యత్నపడలేడు తెలివిమాలి
నరుడు నీ మాయజిక్కి వానరుడె యయ్యె
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౮౬

(1) జ్ఞానులౌ వారల సహవాసమబ్బిన
ఆలుబిడ్డల ప్రీతి యణగిపోవు
సంసార బాంధవ్య సంబంధములు వీడు
హెచ్చిన మోహముల్ చచ్చిపోవు

(1) జ్ఞానులాచార్యుల

ఈషణ త్రయముల నెదుగుతాపత్రయా
        లంతరింపగ గల్గు నాత్మశుద్ధి
అద్దమ్ము వలె హృదయమ్ము గల్గిన నంత
        ఆత్మలోగల పరమాత్మ నెఱుగు
ఆ పరాత్పరుడీవ యంచరయ గల్గి
నిన్ను సేవించి యానందనిలయుడగుచు
నరుడు జీవనముక్తుడై మరియుచుండు;
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౪౭

వయసున్నవరకె యీ పలు కామవాంఛలు
        ముదిమిగూడిన నంత మూలబడును
నీరున్నవరకెగా చారు కాసారంబు
        నీరింకి నంత నాపేరుపోవు
సిరులున్నవరకె యీ పరిజనుల్ సతి సుతుల్
        సిరులూడ నెవ్వ రు దరికి రారు
నిత్య మనిత్యాల నిజము గుర్తెరిగిన
        భవ మోహ బంధ సంబంధముడుగు
బంధమోచన గల్గిన వారె నిన్ను
నీ పదశ్రీలసేవించి నిల్తురయ్య !
నిన్ను నెఱనమ్మి శరణంటి నన్ను బ్రోవు
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౪౮

ధనము యౌవనములు దార దాసీజనుల్-
        కలవాని న నెడి దుర్గర్వ మూడి
కాలంబు వక్రింప గడియలో సర్వము
        కరిగిపోవను; జ్ఞానమరసి మిగుల

ఈ భవ సాగరం బీశుని మాయచే
కల్పితంబని యందు గాంక్ష లుడిగి
నాది నే ననియెడు వాదంబులన్ మాని
సర్వ మీశ్వరుని యిచ్ఛానుగతమె-
యనెడి సద్బుద్ధి గల్గి నిన్ననిశమెవడు
దలచి శరణన్నవాడె నిన్ గలిసి యుండు
ననుచు మది నెంచి శరణంటినయ్య ! నిన్ను;
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౪౯

పగలు రేలును ; వేకువయు సందె; శిశిర వ-
సంతాలు కడుబండి చక్ర మట్లు;
సాగునట్టుల కాలచక్రమ్ము సాగును
ఆయువుడ్గును దాని బాయలేక
ఉన్నంతవరకు పెంపొందు నాశల వీడి
కాలంబు వ్యర్థమై గడవనీక
కర్మలయంబుచే గల్గు మోక్షంబని
కర్మలవిత్ర ! నిన్ ఘనత గొల్చి
నరుడు నైహిక సౌఖ్యాల నాస గొనక
పూని నిన్ జేరి శరణన్న ముక్తి గాంచు-
ననుచు నిన్ జేరి శరణంటి నయ్య ! స్వామి !
రామగిరిదామ ! శ్రీరఘురామ ! రామ ! ౫౦

ఓ వెఱ్ఱివాడ ! నీ కీవిభవపు చింత
హృద్యమైభోజ్యమౌ విధ్య యౌనె ?
ఈ ధన దుర్మోహ వాదమున్ మాన్పెడి
ప్రౌఢ దివ్య జ్ఞాని లేడటయ్య !
ఓయి తృష్ణాతురా ! మాయయౌ భవవార్ధి
దాటించు సద్గురు దైవ మెందు

కానరాడయ్య ! నీ కాసద్గురుండె ర-
　　క్షకుడుగా నన్యులు గానరారు
అట్టి దేశిక హిత పథ మాదరించి
ముక్తిగనుమని నరునికి బోధ జేసి
ఆ పథంబున నిన్ శరణంటినయ్య !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౫౧

కన జొప్పుకట్టు తీరున క్రుంగి తనువెల్ల
　　ముడుతలు వారంగ ముదిమి చేర
తెల్ల సున్నపు తట్టు తీరున తల పూర్తి
　　పండినన్ పండ్లూడి పడ్డగాని
ముదిరిన ముదిమితో చెదరిన బలముతో
　　కుసిదగ్గు దగ్గుచు కూలబడిన
కండ్ల చూపులు తగ్గ ఘన జవసత్వముల్
　　తగ్గగా చేకట్టు తవిలి యున్న
ఒడలు తడవడ చెదురుచు నోర్పుజార
ఆశనూనడు నరుడు నీయడగనడు
నేను నీపైన నాయాశ నిలిపినాను
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౫౨

నరుడు తానెన్నెన్నొ యవభృతస్నానాల
　　తగ జేసినన్ దాన ధర్మములను
నియమ నిష్ఠలు గల్గి నీతిమార్గము లంది
　　ఇది యాత్మ యిది యనాత్మ యటంచు
ఇది బంద మిది మోక్ష మిది జ్ఞాన మజ్ఞాన
　　మని యెఱుంగని గొప్పమనుజుడైన-
వానికి, నుపనిషత్ప్రతిపాద్యమౌ ముక్తి
　　నూరుజన్మలకైన జేరరాదు

కాన హరిగొల్చి జ్ఞానియై ఘనతమీర
స్వామి కృపలకు పాత్రుడై వరలు నపుడె
నరుడు నరుడయ్యి యిల ముక్తి నరసి పొందు
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౨౩

ఇల్లు వాకిలి నిట నీరాగ రోగాల
        నీషణ త్రయముల నీసడించి
ఐహిక బంధాల నావంత గోరక
        భవభోగభాగ్యాల బారి బడక
షడ్వర్గరిపులతో సఖ్యతబడకుండ
        తాపత్రయాలను దగులుకొనక
సర్వసంగ ములను సన్యసించియు దండ
        కాషాయ కుండికల్ గలిగియున్న
భిక్షమెత్తుచు జీవించు పెద్ద పెద్ద
మేటి సన్యాసు లాశల పాటవముల
త్రెంచ జాలరు నిన్నెద నెంచి గనరు;
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౨౪

తగిన భోగములను తదుపసత్కారణాల
        కల్పించి కూర్చు సుఖంబుకంటె
దుఃఖమే యధికము తొలగవు కష్టాలు
        జీవితాంతము శ్రమదీరిపోదు
సకల దుఃఖ సుఖాలు చక్రార పంక్తుల
        తీరుండు, శాంతి తృప్తింత రాదు
సుఖముకై యెంతెంతొ శోషించి కష్టాలు
        పడినంత దుఃఖ మేర్పడు నటంచు
తెలిసి యైహికభోగాల దొలగ జేసి
సర్వమున్ సన్యసించి నిస్సంగుడగుచు

త్యాగియై నిన్ను గొలిచిన యోగి యగును
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౧

ఎవని సద్ధృదయమ్ము జవసత్వసర్వేంద్రి
యాది తత్వమ్ముల వీధికంటె-
అతి పరమౌమేటి యాపరబ్రహ్మలో
తాదాత్మ్యుడై యుండి మోది యగునొ
పటు యోగియైనను బహుభోగియైనను
సంగియే యైన నిస్సంగు డతడె
వాడె సమ్మోదియై వాడె బాలుండయి
ఉన్మత్తుడై చరించు ర్విలోన
అనఘు డాతడె నిస్సంగు డౌను నిజము
దేవ ! నిన్ దప్ప నన్యుని దృష్టి గనడు
ఎన్నగా నుర్వి పరమ ప్రపన్ను డతడు
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౨

గంగాది జీవ తరంగిణీ జలములన్
మించి సద్భక్తిసేవించు నెవడు
పరమ ప్రపన్నుడై వరదు గోవిందుని
చిత్తమింపలర వీక్షించు నెవడు
మంత్రమున్ మహితతన్మంత్రాధి దైవమున్
మంత్రప్రదున్ గురున్ మరువడెనటొ
ఉపనిషత్సారమౌ నురుభగవద్గీత
నెంచి సద్భక్తి పఠించు నెవ డు
వాని కిహ పర సౌఖ్యాలు వరలు; యముడు-
కూడ వానిని చర్చింపబోడు నెపుడు
వాడు మీపదములఁ బొందఁ బరుగునయ్య ,
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౩

తగని కర్మలచేత తల్లి గర్భము జేరి
        జన్మించి మరణించి జన్మ మొందు-
(1) సరణంలు కుమ్మరి సారె గఁదిరుగుచు
        గర్భవాసాల దుఃఖాల బెంచు
ఘోరదుర్నరక సంసారమున్ దాటించు
        రామ ! మీ తారకనామ చింత
సంతత మెదలోన సాగెడు వాడిల
        భవభయ సాగర పారగుడగు-
మీరు వాత్సల్యగరిమతోకూరుములను ! జూపి వానిని కరుణింప జూచెదరట !
సర్వమున్వీడి నిన్నునే శరణమంటి రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ !

సద్వస్తువున నైక్యసంప్రాప్తికై మదిన్
        నియమనిష్ఠలతోడ నిల్పుకొనెడి-
యోగి, సర్వేశుడౌ యోగీశ్వరేశుని
        దయన సద్విషయాల దాటివేసి
అవిదిత విధినిషేధాతి వర్తనులగు
        బాలు నట్లున్మత్తువలె చరించి
దివ్యమఖండమై దీపించుజ్ఞానియై
        అతుల బ్రహ్మానంద మనుభవించు
వాడు, కావున తాదృశవైభవంపు
జ్ఞానసిద్ధికి కారణమైనవాడు
నీవెయని నిన్ను శరణంటి నేలు నన్ను
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౫౮

నీవెవండవొ? చూడ నేనెవండనొ ? గాంచ
        నీవు నేననుచున్న నిర్వురెవరొ ?
ఎటునుండి యెందులకిటకు వచ్చితిమేల ?
        ఇటనుండి యెచటికి నేగుదు యొకొ ?

(1) పద్దతిచక్రారపక్తిని బోలుచు

నా తల్లి యెవ్వరో ? నాతండ్రి యెవ్వరో ?
        ఈ దేహ సంబంధు లెందుకొఱకు
ఇటుల పరామర్శలీతీరు తలపోత
        జరిపించు సంసార సర్వమెల్ల
సాగుచుండెడి స్వప్నవిచారమట్లు
వదలి విశ్వైకసాక్షియై బరగువాని
రక్తి గనువాని కిక పునర్జన్మ లేదు
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౬౦

మనుజు డెందాకను ధనముపార్జించునో
        శక్తియుక్తుండయి భుక్తినిడునొ
ఆలుబిడ్డలు బాంధవాదులందాకనే
        అఖిలోపచారాల నాదరింత్రు
ఆర్జనల్ తగ్గిన నవయవ క్షీణతల్
        కల్గగా వార్ధక్యగతిని గన్న
ఆయాలి బిడ్డలు నా బాంధవాదులు
        పలుకరించరు పగ బట్టియుంద్రు
స్థితిగతుల్ చూడ రెదుటనే ఛీత్కరింత్రు
వీరలన్ నమ్మియున్న బల్ వెతలె మిగులు
భక్తి నెద నమ్మి నిన్గొల్వ ముక్తి గలుగు;
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౬౧

పలుతీరు సుఖదుఃఖముల పెనుగాలితో
        సుతకళత్రాదుల సుడుల తోడ
బంధుమిత్రాదిసేవక మకరాళితో
        తాపత్రయపు ఘీల ప్రాపుతోడ
తీవ్రషడ్రిపులైన తిమి తిమింగిలులతో
        ఈషణత్రయపు తాబేళ్లతోడ

విషమ విషయమహాభీలమౌ జలముతో
కలిమిలేముల తరంగాలతోడ
భీకరస్వార్థకామనావేల్లితములు
ఉద్ధృతాశాది శైవాల బద్ధమైన
భవజలధి దాట మీ పదాబ్జములె దిక్కు
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౬౨

అంతులేనట్టి తృష్ణాతోయములతోడ
స్మరపవనోద్ధితోర్మములతోడ
అమితదారావర్తనా2గాధములతోడ
కామోపభోగపంకంబుతోడ
తనయ సహజ గ్రాహ ఘన సంఘములతోడ
బాంధవజన మీన పటలి తోడ
సుఖదుఃఖమయములౌ సుడిగుండములతోడ
ఆశాది శైవాల రాశితోడ
జనన మరణాలు విడని యుప్పెనలతోడ
పొంగు సంసార జలధిలో మునుగుచుంటి
ఆదుకొనుమయ్య ! నీ భక్తి నౌక నొసగి
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౬౩

ఇయ్యది
శ్రీరామగిరి – శ్రీరఘురామశతపారిజాత ప్రబందమ్మున
శ్రీరామగిరి – శ్రీరఘురామ – వినుతి – అనుసప్తమ
గుచ్ఛము సర్వము శ్రీసీతారామపాద
పద్మార్పణమై ముగిసినది
శ్రీశుభమస్తు

శ్రీః

# శ్రీసీతారామచంద్రస్వామినేనమః

## శ్రీరామగిరి – శ్రీరఘురామశతపారిజాతప్రబంధము

## శ్రీరామగిరి – శ్రీరఘురామ – సన్నుతి యను అష్టమగుచ్ఛము

శ్రీరామ ! రఘురామ ! సీతామనోబ్జా2తి-
సుందరానందశ్రీశుభదరామ !
జయరామ ! జయజయ జానకీ శ్రీ రామ !
సద్భక్త హృదయ సంచార రామ !
శ్రితశుభంకర నామ ! శ్రీమైధిలీరామ !
మౌని మానస హంసమా ! సుధామ!
దురిత దానవభీమ ! వర శూర నుతరామ !
నళిన కోమల నయనాభిరామ !
పరమకల్యాణ గుణగణ భాసమాన-
మధురమంజులహృత్సీమ ! మహితనామ !
మాన్యదశరథరామ! నిన్ మది నుదింతు
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧

శ్రీమైధిలీనాథ ; శ్రితజనా2వనగాధ
గాధినందన నుత ! కావవయ్య !
వరధర్మ గుణ భూష ! పరమధార్మికతోష !
శ్రితవిభీషణ పోష ! సేవకుడర !
శ్రీకంఠనుత నామ ! భీకరారివిరామ !
కారుణ్యగుణ దామ ! కనికరింపు
సాధుజనావనా ! వేదసన్నుతగుణా !
ఆర్తసంత్రాణ ! నన్నాదుకొనవె !

సకలకల్యాణ గుణగణస్వాంతసీమ !
రామ ! నిర్జిత భార్గవ భీమ రామ !
దాసుడను రామ ! శరణంభద్రాద్రి రామ !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౨

నారాయణా ! యని నమ్మి నిన్మదిలోన
భవదీయ పదములన్ భక్తిగొలుతు
పద్మనాభ ! ముకుంద ! పరమాత్మ ! యని పేర్మి-
సేవించి నిన్ను పూజింతునయ్య !
దేవదేవా ! హరీ ! గోవింద ! మాధవ !
శ్రీనాథ ! యని నిన్ను జేరికొలుతు
అచ్యుతాऽనంత ! మురారి! శ్రీనాయక !
అని నిన్ను రాఘవా ! మననజేతు
కేశవా ! ~~ఈశ~~ ! సర్వేశ ! కీర్తనీయ -
రమ్యగుణధామ ! యని నిన్ను రక్తిగొలుతు
అవ్యయాత్మక ! శరణంటి ఆదుకొనవె
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! 3

శ్లథసంధి జర్జర వ్యథలతో సోలుచు
పరిణామపేశలంబయిన తనువు
ఎప్పుడో ఎక్కడో యే నిమేషంబునో
ఏ మూలనో యెట్లు నేవిధమున
పడిపొవు; తప్పదు పలుమందుమాకుల
కొఱకు తపించుచు కుందనేల ?
రామతారకమను రసయోగదివ్యౌష -
ధంబు దుర్భవతారకంబు గలదు
ఆ ఘనంబైన దివ్యౌషధంబు గొనుచు
దురిత భవరోగముక్తిని బరగవచ్చు

నిక్కమిది నమ్మవచ్చు నో నీరజాక్ష !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ४

శిష్ట సద్భక్త దుష్కృత పన్నగములకు
ఘనమైన మహిమల గారుడమణి
సన్మౌనిలోచన చాతకాంబుద మణి
సాధుహృత్సౌందర్య సాధకమణి
జానకీహృదయాబ్జ చారు భాస్కరమణి
దక్షులౌ భక్తుల రక్షకమణి
దేవలోక శరణ్యదివ్య చింతామణి
ఘనభక్తపాలక కౌస్తుభమణి-
పరమ కాకుస్థ వంశ సంవర్ధక మణి !
మన్మనోకైరవేందుసన్మణి ! గుణమణి !
చారుమచ్చిత్త చాతకనీరదమణి !
రామ ! శరణంటి ! శ్రీరఘురామ ! రామ ! ౫

ఉపనిషద్వేద్యమై యొప్పిన మంత్రంబు
మహిత వేదాశ్రయ మంత్రవరము
శత్రునిర్మూలన సాధక మంత్రంబు
అవివేక దహన మంత్రాద్భుతంబు
ఘోర సంసార సంతారక మంత్రమ్మ
మాన్య సంపద లిచ్చు మంత్రవరము
దారుణవ్యసన సంహారకమంత్రంబు
మహి జన్మ సాఫల్య మంత్రవరము
మధుర శ్రీరామతారకమంత్రవరము
మదిని జపియించువారికి మధురఫలము-
నొసగు నంచు జపించుచు నుంటి స్వామి !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౬

వ్యామోహముల నెల్ల బాపి కూల్చెడి మందు
మౌని మనోసేవ్య మైన మందు
ఖలదైత్యులకు నార్తి గలిగించు పెన్మందు
భువనసంజీవన జవపుమందు
భక్తుల కత్యంత బలకరమౌ మందు
భవ రోగ భయ హరంబైన మందు
ఘనమైన శ్రేయస్సు గలుగజేసెడి మందు
ఇహ పర శ్రీల నందించు మందు
రామ తారకసత్సుధా రసపు మందు
జన్మ రాహిత్య మర్థించు జనుల కిద్ది
శుభదమౌ మందు శ్రీరామ జోగిమందు
(1) రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౭

స్వామి ! మీ పదపద్మ భక్తి హీనుల నైన
క్షీణపుణ్యులను వీక్షింప నెపుడు
దేవ ! తావకమైన దివ్యసత్కథకాని
వేరైన కథను నే విన నొకింత
భువనేశ ! నిను దప్ప భువి నన్యదైవమున్
స్వాంత మందింత నే సంస్మరింప
ఈశ ! నీ పరిచర్య నెన్నిచేయుటతప్ప
ఇతరుల పరిచర్య నెఱుగలేను
జన్మజన్మాలలోన నే నన్య జనుల (2)
మదినిదలవను నినుదప్ప మాన్యచరిత !
నన్ను కరుణింపు శరణంటి నమ్మికొంటి !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౮

(1) రమ్యభద్రాది శ్రీరఘురామ! రామ (2) సురుల

పెను తృష్ణయను నీరు; ఘనమైన మదనాని-
లోత్థిత మోహజాలోర్మితతులు;
ఆలి పెన్సుడిగుండ మనుగు పుత్రులు మొస-
ళ్లనుజన్ములు తిమింగిలాలు; విహిత -
రక్తసంబంధులు రగిలెడి బడబాన-
లంబులు, బంధువు లలఘు మీలు
కలిమి లేముల యుప్పెనలు గల్గి చెలరేగు;
పారమే లేని సంసార జలధి
మున్గ సద్భక్తులను తీరమొప్ప జేర్చు
భక్తియను నావనిడి; భవత్పాదపద్మ-
సన్నిధిని జూపి రక్షించు స్వామి వీవె
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౯

రసనమా ! కీర్తించు రఘురామచంద్రుని
చిత్తమా ! రఘుపతిన్ జేరి కొలువు
కరయుగ్మమా ! రఘువరునినర్చింపుము
కర్ణద్వయంబ ! రాఘవుని వినుము
లోచనద్వయమ ! శ్రీలోలుని దర్శింపు
హరిమందిరము జేరు చరణయుగమ !
ఘ్రాణమా ! మిగులనాఘ్రాణింపు రఘునాథ-
జలజాంఘ్రి యుగళ శ్రీతులసి నెపుడు
మూర్ధమా ! రామవిభునకు మ్రొక్కుమనుచు
అవయవ ములకు నెల్ల నే నై వచించి
నిన్ను జేరితి కరుణింపు నీరజాక్ష !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౦

శ్రీరామ ! రఘురామ ! శ్రితపారి జాతమా !
కరుణానముద్రమా ! కావుమయ్య !
రఘుకులాంబుది సోమ ! రణ రంగరిపుభీమ !
దయజూడుమా ! రామ ! దాసునయ్య !
పతిత పావన నామ ! పరమ సద్గుణ ధామ !
దాక్షిణ్య గుణ సీమ ! దయగనయ్య !
కల్యాణ రఘురామ ! ఘన నీరదశ్యామ !
దైత్యారి భీమ ! నిన్ దలతు నయ్య !
రామ ! నినుదప్ప నితరాంతరముల నెఱుంగ
సర్వమున్ వీడి నీవె నా సర్వ మనుచు
శరణ మని చేరితిన్ నను గరుణ నేలు
రామగిరి ధామ ! శ్రీరఘు రామ ! రామ ! ౧౧

శ్రీరామ విభుడు సర్వేశుండు సేవ్యుండు
సురహితాభీష్టదు డురు గుణుండు
భువనాధిపతి సర్వభూసార్వభౌముండు
రఘుకులాన్వయడు నారాయణుండు.
శ్రితుల కోర్కెల దీర్చ సీతా సమేతుడు
వానిని గొల్చు జీవనమె మేలు
కతిపయ గ్రామాధికారియో నెవనినో
ఒక పురుషాధమున్ సుకృతుడనుచు
కరము నర్థించువాడు మూకాంధుడగుచు
పతితుడై పోవు, జీవన భృతుల కొఱకు-
కరము నిన్ బాడుకొను బిచ్చగాడు మేలు
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౨

శరణాగత త్రాణ బిరుదాంకితుడు నైన
రాముడే నా పాలి రక్షకుండు
కరుణామృతానంద కమలాయతాక్షుడౌ
రాముడే నా గురురా ద్వరుండు
ఆర్తలోకశరణ్యు డౌ మేటి విభు డైన
రామునే మది నమ్మి రక్తి గొలుతు
కొలుచు భక్తుల కెల్ల గొంగు బంగారమౌ
శుభదరామునకు దాసోహ మందు
రాము డురురిపు హరు డుదారగుణుండు
ధార్మి కోజ్జ్వల రూపుడు చారగుణుండు
రాముడే సర్వమిల నాకు, రామ ! బ్రోవు
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౩

## -: శ్రీరామకథా సంగ్రహము:- (బాలకాండ)

చండ కిరణ వంశ మండన రఘురామ !
దండిత వైరి దోర్దండ రామ !
బ్రహ్మ రుద్రేంద్రా మరాది వందిత రామ !
పరమసత్వద పరబ్రహ్మ రామ !
సర్వ కాలాత్మక ! సర్వేశ్వరా ! రామ !
పరమాత్మ ! శ్రీసార్వభౌమరామ !
సాదు లోక శరణ్య పాదపంకజ రామ !
ఆర్తలోకాభయ హస్త రామ !
ముని జనానంద వందిత ముగ్ధరామ !
లలిత సౌభాగ్యగరిమ కల్యాణ రామ !
భక్తజనపారిజాతమా ! పాహి రామ !
రామగిరిధామ ! శ్రీరఘు రామ ! రామ ! ౧౪

కాకుస్థ వంశాబ్ధి ఘన నీల చంద్రమా !
దశరథ యజ్ఞ సంతాన రామ !
సుదతి కౌసల్య కౌ సుప్రజా ! శ్రీరామ !
కౌశిక మఖరక్షకార్య రామ !
రాయియై పడియున్న రమణి నేలిన రామ !
గౌతమార్చిత పాదకమలరామ !
దండితోద్దండ దుర్దైత్య తాటక భీమ !
ఖలసుబాహ్వాది రాక్షసవిరామ !
ఖండితోద్దండ శూలి కోదండ రామ !
జనక పూజిత జానకీ జాని ! రామ !
ఆశ్రితుడ బ్రోవు నన్ను కల్యాణ రామ !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౫

(అయోధ్య)

పరమ శ్రీసాకేత పురజనార్చితరామ !
సకల సద్గుణ గణ(1)స్వాంతరామ !
మైధిలీమానసమధుర మరాళమా !
పితురాజ్ఞ పాలక విబుధరామ !
ప్రియ గుహుంక్షాళిత వినుతాబ్జ పదరామ !
ముని భరద్వాజ సంపూజ్యరామ !
చిత్రకూట నివాస శ్రితపారిజాతమా !
చింతిత దశరథ స్వాంతరామ !
పైతృ కర్మల దీర్చిన భవ్య రామ !
అడుగ భరతుడు పాదుక లిడినరామ !
దండకావనరామ ! నన్ దయలగనుమ !
రామగిరిధామ! శ్రీరఘురామ ! రామ ! ౧౬

(1) సార్వభౌమ

(అరణ్య)

దుష్ట విరాధునిన్ దునిమిన శ్రీరామ !

మానిత శరభంగ మౌని రామ !

ముని యగస్త్యుని కృపన్ బూని వెల్గిన రామ !

పంచవటిన్ జేరి వరలు రామ !

శూర్పనఖకు నార్తి నేర్పరచిన రామ !

ఖరదూషణాది దుష్టలవిరామ !

ఇషువునన్ మారీచు నేచి కూల్చిన రామ !

సీతా వియోగ వి శీర్ణరామ !

పడతి శబరికి మోక్షంబు నిడిన రామ !

వర జటాయువు నేలిన వరద రామ !

ఖండితకబంధ ! వన రామ ! కరుణ గనుమ !

రామ గిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౭

(కిష్కింధ)

హిత హనుమంత సేవిత పదాంబుజ రామ !

(1)సుగ్రీవరాణ్ణుత సుగుణ రామ !

బలగర్వితోన్మాది వాలి సంహార రామ !

కృత కపిరాజ్య సుగ్రీవ రామ !

అంగదున్ యువరాజనంగ జేసిన రామ !

సుగ్రీవు వెఱపిన సూరి రామ !

నలు దిక్కులకు వానరులను బంపిన రామ !

ప్రేషిత దూత కపీశ రామ !

విహిత హితకర లక్ష్మణ వినుత రామ !

కీర్తి విస్తృత రామ ! కిష్కింధ రామ !

చేరి శరణంటి నిన్ను రక్షింపు రామ !

రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౮

(1) వినుత సుగ్రీవరాడ్వి జయరామ

(సుందర)

కపి ముఖ్యసేవిత కారుణ్య గుణ ధామ !
పరమ సద్గతి విఘ్న హరణ రామ !
ఘన వార్నిధిని దాటు హనుమ సన్నుత రామ !
ధరణిజా ప్రాణ ప్రదాత రామ !
దుష్ట దశానన దూషక కపిరామ
శిష్ట హనుమంత సంసేవ్యరామ;
కాంత సీతోదిత కాక రక్షక రామ !
హనుమ దర్పిత మణిందనరు రామ !
పవన నందన శాంతిత స్వాంత రామ !
విజయ సుంగర హనుమంత వినుత రామ !
ధార్మి కోద్దండ రామ ! నన్ దయలగనుమ !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౯

(యుద్ధ)

రావణ నిధన సంప్రస్థాన జయ రామ !
సత్సమాహ్వూతకపిసైన్య రామ !
ఆగ్రహ సంశోషితాబ్ధిసన్నుత రామ !
భక్త విభీణాభయద రామ !
పర్వతసేతు నిబంధనోజ్జ్వల రామ !
ఖండితా సుర ఘటకర్ణి రామ !
రావణ కుంభ కర్ణాది దైత్యవిరామ !
అహి మహి రావణ హనన రామ !
విధి మహేంద్రామరాది సంవినుతరామ !
అగ్నిపరిపూత జనక సుతా భిరామ !
విజయ రాఘవ రామ ! నన్ బేర్మిగనుము !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౨౦

విభవాభిషిక్త శ్రీశుభ విభీషణ రామ !
        సత్య నిరూపక సార్వభౌమ !
మహిత పుష్పక సద్విమాన యాయిన రామ !
        భరత వాక్పాలక భద్ర రామ !
సాకేత పుర జన సంతోషకర రామ !
        పట్టాబిషేక సంపన్న రామ !
సన్మానితోద్విభీషణ కపి రాట్రామ !
        హనుమదాదిబుషీంద్రవినుతరామ !
ధర్మపాలన తత్పరా దర్శరామ !
త్రిభువనైకైక పాలక దివ్య రామ !
రామ ! వినతుడ బ్రోవు నన్ రాజరామ !
రామగిరి ధామ ! శ్రీరఘు రామ ! రామ ! ౨౧

శ్రితభయాపహ దివ్య శ్రీనామ ! జయ రామ !
        అజహరేంద్రార్చిత విజయ రామ !
కుశలవ కీర్తిత గుణ గణ శ్రీరామ !
        మైధిలీ హృదయాబ్జ మధుర రామ !
వాల్మీకి విరచిత పరమ సంపత్ప్రద
        రామాయణాశ్రయ రమ్య రామ !
మహిని ప్రవేశించు మైధిలీ నుత రామ !
        ధీర సద్ధర్మావతార ! రామ !
పరమ పట్టాభి షేకిత భవ్య సుగుణ
లవకుశార్చిత చరణ వైభవ పు రామ !
(1) ధర్మ పరిపూర్ణ రామావతార ! రామ
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౨౨

(1) సత్యపరిపూర్ణ సాకేతసార్వభౌమ!

పంచాయుధోజ్జ్వల బాహు సుందర రామ !
ఘననిత్యసూరి సద్వినుతరామ !
హరి హర బ్రహ్మేంద్ర సుర సమార్చిత రామ !
శేష వాయుజ ఖగ సేవ్య రామ !
పరమర్షి మానస వరరాజ హంసమా !
సనకసాద్యనఘసద్వినుత రామ !
సకల లోకానేక సంభావితోన్నామ !
సర్వ జీవా2వన స్వాంత రామ !
సిద్ధ ము క్తాది సద్భక్త సేవ్య రామ !
రమ్య వైకుంఠ నగర భద్రాద్రిరామ !
భక్తశ్రీ శ్రీనివాస హృత్పద్మ రామ !
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౨౩

ఈ కాయ మిల సొంతమా ? కాదు జీవికి
అరువుకై వచ్చిన యద్దె యిల్లు
అద్దింటివానికి నధికార మింటిపై
నుండదు యజమాని కుండు టౌను
అద్దె యిచ్చిన నాళ్ల నందుండవచ్చును
ఇవ్వని నాడిల్లె యివతలించు
మసల దైహిక శక్తు లసువు లున్నన్నాళ్ళ
తనువున జీవుండు తగవసించు
బల మసువు లూడ నొడలున దొలగజేయ
బడును జీవుడు; సమయే శు బలము చేత;
దేహమున్నప్పుడే రాము దెలియ దగును
రామగిరి ధామ ! శ్రీరఘు రామ ! రామ ! ౨౪

దేహ బంధువు లెవ్వరిహ శాశ్వతులు గారు
వారిదౌ సుఖదుఃఖ వార్ధి దాటి
ఇల గల్గువానికి నేది నిల్కడ లేదు
మనిషి పెంచిన మేటి మంచి నిలుచు
వాడొనర్చిన ధర్మ వైభవ న్యాయంబు
సత్యంబు నీతియే శాశ్వతంబు
వరధర్మ మార్జించి పాము కుబుసంబును
తొలగి నట్టుల పాప ములను తొలగి
స్వకుల ధర్మాలలోన పెంపంది మిగుల
కీర్తి గడియించు కొనువాడె మూర్తి గొన్న
ధర్మ దేవత, వాడె శ్రీధవుని హితుడు
రామగిరిధామ ! శ్రీరఘురామ ! రామ ! ౨౫

ప్రజలకు నిల వారి వారి కులా చార
ధర్మముల్ మిగుల ప్రధానములగు
వానిని వారు నిర్వర్తించు చున్నను
పుణ్యులై భవబంధముక్తి గాంత్రు
పర కుల మత ధర్మ పరుల ద్వేషింపక
అతిథులన్ వలె పేర్మి నాదరించి
సమతలన్ మమతలన్ సాగుచు తనదైన
ధర్మమున్ విడువక తరలవలయు
స్వకుల ధర్మము నందు సమసిన మేలౌను
పర ధర్మమందు పెంపైన భయమె
స్వకుల ధర్మంబుచే జాతి జగతి వెల్గు
గౌరవ శ్రీలు పెంపొంద గలుగు మిగుల
ఇహ పరమ్ముల సాధించి విహితమగును
రామగిరి ధామ ! శ్రీరఘు రామ ! రామ ! ౨౬

ఈలోక మొక ధర్మశాల జీవుండిందు
వచ్చిపోవుచు నుండు పాంథునట్లు
కర్మవశంబుచే కలుగు దేహమునందు
జీవుడు వచ్చుచు పోవుచుండు
ఏపాంథునకునైన నిలధర్మశాలలు
శాశ్వతంబులుగావు జగతిలోన
లోకంబువానికా కాదు శాశ్వత మెందు
లయకర్మడై జన్మలందరాడు
వచ్చిపోయెడి జీవికై వగవ నేల ?
కర్మ విలయంబుకై హరిన్గాంచి మదిని
జన్మముక్తిని గల్గి తత్సన్నిధి గను
రామ ! నిజమిది శ్రీరఘురామ! రామ! ౨౭

(పాలకుడు)

పాలకునకు రాజ్య పాలనమున కంటె
మించిన దే ధర్మమెందు లేదు
పాలకుడెప్పుడు ప్రజల వర్ణా శ్రమా -
చార ధర్మంబుల సాకవలయు
జనులచే వారివౌ జాతి సద్ధర్మాల
విధిగనే యాచరింపింపవలెను
ప్రజ తమ జాతి సంపదలైన ధర్మమున్
విడిచిన పాపమున్ బడయుచుండు
వాని పాపంబులన్ ప్రజా పాలకుండు
అనుభవింపక తప్ప దెంతైన నవని-
దేశ భద్రత క్షీణించు; దేవ ! నిజము;
రామగిరి ధామ ! శ్రీరఘు రామ ! రామ ! ౨౮

కాలంబునకు రాజు (నేత) కారణం బైయుండు
కాలమే రాజుకు (నేతకు) కారణ మగు
కాలంబునకు రాజు (నేత) కవని నన్యోన్యాశ్ర-
యైక సంబంధమే యలరియుండు
ప్రభుత తీరున ప్రజావళి చరించుచు నుండు
ప్రజ చెడన్ ప్రభుతలు పతన మౌను
ప్రభుతలు పడిపోవ ప్రజలలో ధర్మాలు
చెడును, దేశమ్ములు చెడుచు నుండు
స్వార్థముల వీడి స్వపర భేదార్థమూడి
ధర్మ సత్యైక న్యాయ సద్దండ మూని
ప్రభుత నడచిన దేశంబు భద్ర మగును
రామ ! నిజమిది శ్రీరఘు రామ ! రామ ! ౨౯

రామ రాజ్యంబిల రాజిల్ల వలె నన్న
ధర్మంబు నాల్గు పాదాల పైన
నడువంగవలయును; న్యాయనీతి పథాలు
స్వార్థరాహిత్యమై సాగవలయు
జాతులు తమ తమ సద్ధర్మముల యందు
సాంకర్య రహితమై సాగవలయు
ఆచార మూలమై యలరు ధర్మంబులు
ఆచారమును వేదమవని నిల్పె (ల్పు)
ఎచట ధర్మంబో (1) రాముడు నచట నుండు
దైవ రూపుడుగా రాజు (నేత) ధరణి నేల
ప్రజ సుఖించును, దేశమ్ము బాగుపడును
రామ నిజమిది ! శ్రీరఘు రామ ! రామ ! 30

(1) దైవము

## -: నతి :-

తల్లివై చల్లని దయల నందించుచు
కంటికి రెప్పవై కాతు వీవె
తండ్రివై జీవిత ధర్మాల నెఱిగించి
కడు వత్సలత జూపి కాతు వీవె
అన్న వై సామాజి కోన్నత మార్గమున్
జూపించి కరుణింప జూతు వీవె
హితుడవై మంచి స్నేహితుడవై హితములన్
బోధించి స్నేహాన బ్రోతు వీవె
నేతవై ధర్మమును సాగజేతువీవె
బాంధవుడవయ్యి సుఖ దుఃఖ పథములందు
ఆదుకొను దీవె యని శర ణంటి రామ !
రామనన్నేలు ! శ్రీరఘు రామ ! రామ ! 30

ఎన్ని (మా) సార్లో నీకు విన్న పా లెన్నెన్నొ
చేసితి రక్షింప జేసెదవని
కాస్త చూడని దరకాస్తు చేసితినీకు
కష్టాల గడతేర్చి కాచెదవని
ఆచార్య కరుణ తో నందించితిని మొరల్
షడ్రిపున్ గూల్చి నన్ సాకెదవని
అమ్మతో జెప్పి మీ కందించితిని వెతల్
భవరోగ బాధలన్ బా పెదవని
ఆప్త సుజనులతోడ నా యార్తి నెల్ల
తెలియపరచితి గా పాడ గల్గుదువని
తండ్రి ! నతిజేసి శరణంటి దయలగనవె !
రామగిరి ధామ ! శ్రీరఘు రామ ! రామ ! 31

ముగ్ధ రమ్మల పేర్మి ముద్దుల జాబిల్లి
పంక్తి రథునికి కూర్మి పాలవెల్లి
సీతమ్మ దొరసాని సిరి పారిజాతము
అను జన్మతతికి వాత్సల్యజలధి
గాధి నందన వశిష్ఠాది ఋషీంద్రుల
స్థిర మానసోజ్జ్వల పరమహంస
పరమ భక్తులపాలి సురకామధేనువు
కలిభవార్తుల పాలి కల్పశాఖి
చేరి సేవించు సుజనుల చింతదీర్పు-
దివ్య చింతామణీంద్రము దేవ! మీరు
మమ్ము రక్షించు రక్షకమణి యు మీరె
రామగిరి ధామ! శ్రీరఘు రామ! రామ! 33

అల వశిష్ఠమునీంద్రు డలఘు తపంబేమి
చేసెనో గురుడయ్యి సేవల గొనె
కౌశికు డే పూజ ఘటియించెనో మీకు
కల్యాణ మొనరించి ఘనత గాంచె
(1) ఆ యహల్యే సేవ నందించెనో భవ
త్పదమాన శిలరూపు బాసియెదిగె
జనకుడే జ్ఞానాన సాగెనో మిము గొల్చి
అవనిజ నిచ్చి తానై తరించె
స్వామి! నేనైన విధుల సంచారిగాను! అనిశ మోర్పున మిమ్మెనాయాత్మలోన
తలచుటే దప్ప యన్యమున్ దలపనెపుడు! రామగిరిధామ! శ్రీరఘు రామ! రామ!

---

(1) ఆయహల్యాసతి యందిచెనేసేవ
భవదంఘ్రిసోక శాపంబుబాసె

ఇయ్యది
శ్రీరామగిరి - శ్రీరఘురామశతపారిజాతప్రబంధమున
శ్రీరామగిరి - శ్రీరఘురామ సన్నుతియను అష్టమ
గుచ్ఛము సర్వము శ్రీరఘురామపాదపద్మా
ర్పణమై ముగిసినది
శ్రీశుభంభవతు
శ్రీః

శ్రీః

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

శ్రీరామగిరి – శ్రీరఘురామశతపారిజాత ప్రబంధమ్మున

శ్రీరామగిరి – శ్రీరఘురామ – మంగళశాసనము – నవమగుచ్ఛము

శ్రీసతీ జానకీ చిత్తాబ్జ భృంగాయ
మధుర మోహన దివ్య మానసాయ
శ్రీకోసలేశాయ చిదచిత్స్వరూపాయ
రాజాధిరాజాయ రాఘవాయ
దశరథ తనయాయ ధర్మ స్వరూపాయ
పితురాజ్ఞ పాలక ప్రియసుతాయ
శేషశేషత్వసంశ్రితభవ్య మానస-
సౌమిత్రి కైంకర్య సత్కృతాయ
భక్త పవమాన సుత నుత భవ్య చరణ -
పద్మ యుగళాయ తే విభవాభిరామ !
మంగళాని చ సంతు శ్రీమాన్య రామ !
రామగిరి ధామ ! శ్రీరఘు రామ ! రామ ! ౧

ఖలులు దుర్మద గర్వ కలుష రావణులాది
ఛలుల నడచిన దోర్బల విశేష !
ఇంద్ర నీలచ్ఛాయ లెదగాడు నవనీల
నీరద శ్రీశుభచారుదేహ !
శతసహస్రోన్నత సౌందర్య పరిపూర్ణ -
విమలదళాయత కమల నయన !
సీతామహాలక్ష్మి చిత్త నీరజ మందు

ఆటాడు సరసాల తేటి రాజ !
మహిత తామ్రోదరద్యుతి విహిత చరణ!
స్వామి ! మీకును మీ పదశ్రీమహిమకు
మైధిలీలక్ష్మి కగు జయ మంగళములు
రామగిరి ధామ ! శ్రీరఘు రామ ! రామ ! ౨

త్రిభువన మోహన దివ్య సన్మంగళ-
విగ్రహలావణ్య ! విజయరామ !
బలవిక్రమములతో ఖలరావణాదుల
పీచమూడ్చిన మహావీర రామ !
వేద విద్యారణ్య వీధిలో విహరించు
జ్ఞాన యోగానంద శ్రీనృసింహ !
గణ నీయ భవదీయ కమనీయ శ్రీసతీ
ధరణి జా హృదయ సౌందర్యరామ !
స్వామి ! ఇట మీకు మీ శ్రీకి మీమనోజ్ఞ
తను విలక్షణలక్ష్మికి జనుల దృష్టి
తగులకుండగ మంగళంబులు గలుగుత !
రామగిరి ధామ ! శ్రీరఘు రామ ! రామ ! 3

ఆగమ వేద్య ! వియోగంబులేకుండ
కాలతత్వము లుండ గల్గుదాక
ఆశ్ర యాశ్రయిలుగ నమరుచు నిత్యమై
కలసి యిద్దర ముండ వలెను స్వామి !
మీ యెదపైన లక్ష్మి దేవి నవ నిత్య-
శ్రీయౌవనమున రాజిల్లుగాత !
వర సహస్రార భాసురము మీ కుడి చేతి

చక్రాయుధము దిగ్విజయము గనుత !
శత్రు హృద్భేద్య ఘోషయౌశంఖమునకు
పటుశరాసన శరముల పటిమ కెపుడు
జయము విజయము ఘనదిగ్విజయములగుత !
రామగిరి ధామ ! శ్రీరఘు రామ ! రామ ! ౪

శ్రీహరి కైంకర్య శ్రీలచే పెంపొంద-
కోరిక గల భక్త కోటులార !
చేరగా దలచిన జేరుడు మాత్రోవ
స్వామి కల్యాణోత్సవాలలోన
పాల్గొనుండొక మాట పాటింపుడిట మాకు
సాధనాంతరముల చాలు లేదు
అటులున్న వారల కిట గోష్ఠిలో స్థాన-
ముండ దా మచ్చు మాకుండ దెపుడు
ఖలులు దైత్యులు గల్గు లంకాపురమ్ము
సమయ జేసిన రాఘవస్వామి కొఱకు
మంగళంబులు సేయ రమ్మంటిమయ్య !
రామగిరి ధామ ! శ్రీరఘు రామ ! రామ ! ౫

తమకు చికీర్షితార్థములు పొందక ముందె
దేహమూడక ముందె తెల్వి గల్గి
మోక్షార్థులార ! తెంపున యోచనలుసేసి
గట్టిగా నిర్ణయంగలుగుడయ్య !
స్వానుభవము వీడి చక్కగా మా గోష్ఠి-
గలిసి పొండిది కాంచ ఘన తరుణము
నారాయణాఖ్య మనమ్మనుష్ఠింపంగ

మది యొప్పినన్ వేగ మసలి రండు
విభుని కిట మీరు మంగళ విను తులొప్ప-
జేసి ధన్యులు కండని చెప్పినాము;
సాధుజనులకు; మంగళా శాసనములు
రామ! మీకివె శ్రీరఘు రామ ! రామ ! ౬

అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుడైన
హరి రావణాది దుష్కరుల గూల్చె
సర్వదేశములందు సర్వకాలావస్థ-
లందు తత్కైంకర్య మందు కులము-
నందు జేరిన హరి బాంధవజనులార !
కీర్తింపు డురు భక్తి గేశవులను
నాది నే నను భావ నల వీడి హరి గొల్వ
కలసి మాతో మనో బలము గలిగి
రండి సేవించి వానికి రక్తి గూర్చు
మంగళా శాసనము పాడి మను డటంచు
చాటి; చేసితి మంగళా శాసనములు
రామ! గైకొమ్ము ! శ్రీరఘు రామ ! రామ ! ౭

మా తాత తండ్రి ముత్తాత లాదులు మేము
కొలుతు మన్యము వీడి కోరి మిమ్ము
నవ పునర్వసు శుద్ధ నక్షత్రమున చైత్ర
మాసాన జన్మించి మహిజ నమరి
ఖలుల రావణ కుంభకర్ణాదులన్ గూల్చి;
నిను దప్ప ని తరము నెరుగలేని-
సద్భక్తులను గావ శ్రమల నొందిన స్వామి -
కలసత దీర సేవల నొనర్చి

మంగళా శాసనము చేసి మసలు డనుచు
భక్తులకు దెల్పి; వేన వేల్వత్సరములు
వెలుగుడని యిచ్చు కొంటి దీవెనల గొనవె!
రామగిరి ధామ! శ్రీరఘు రామ! రామ! ౮

సూర్య చంద్రాగ్నులు శుష్కించు దీప్తితో
రాజిలు శంఖ చక్రముల గుర్తు -
లిరుభుజంబుల గల్గి తిరునామ మమరిన
మా వంశముల వారమైన మేము
ఇతరాంతరము వీడి యాశ! మీ పదసేవ-
చేయుచు నున్నాము చిత్తమలర
బల దుర్విదగ్ధ సుబాహు మారీచుల
కడతేర్చి జన్నమున్ గాచినట్టి-
బాణ బాణాసనంబుల భారమూన
నెఱుంపు సొగసుల భుజముల నె దుగు స్వామి!
మంగళా శాసనము లివ్వి; మాన్య! గొనవె
రామగిరిధామ! శ్రీరఘు రామ! రామ! ౯

భుజియింప ఘృతపరిపూర్ణ ప్రసాదమున్
పూగకర్పూర తాంబూలములను
స్రక్చందనాల వస్త్రాల హారాదులన్
కర్ణభూషణ ముల కంకళ ముల
ఘన తులసీ మాలికాది కైంకర్యమున్
భవదంఘ్రి సేవల భాగ్యములను
కారణంబులు లేక కల్గిన కరుణతో
విహిత కల్యాణ సద్విభవములను

శ్రీశ ! భవ దీయులకు కృపసేసినారు;
(1) విహగకేతన ! శ్రీమహా విభుడవైన
స్వామి ! నీకివె మంగళా శాసనములు
రామ ! గైకొను ! శ్రీరఘు రామ ! రామ ! ౧౦

కట్టి వీడిన తమ కనకాంబరము మేము
ధరియింతు మయ్య ! మీ దాస్య మమరి
మీ భుక్త శేషమే మా భోజనంబగు
ముడిచి వీడిన తమ పూలె హితము
మీ కిష్టమైన సొంపిల్లు కైంకర్యాలె
మా కనుష్ఠానమై మసలునయ్య !
భవదీయ శ్రీపునర్వసు మహోత్సవవేళ
శేష సింహాసనా సీను డవయి
స్వామి ! సీతాసమేతులై వరలు మీకు
ప్రాకృత జనాల దృష్టులు బరగకుండ
మంగళా శాసనము సేతుమయ్య ! రామ !
రామ ! గైకొను ! శ్రీరఘురామ ! రామ ! ౧౧

సర్వ శేషివె యైన సత్య నారాయణ -
స్వామివౌ మీకె మా సకలమైన
కైంకర్యములు చేయ గలమని పత్రమ్ము
వ్రాసియిచ్చితిమయ్య ! బాససేసి
నాటి నుండియు మేము నాది నే ననుటను
వీడితిమయ్య ! నీ తోడు గోరి
అల పునర్వసున మంజుల మహోయోధ్యలో
జన్మించి దైత్యుల సమయజేసి-

(1) ఇన్నియిచ్చిన మీకేమి యివ్వగలము ?

అవని ధుర మూడ్చినట్టి ధర్మావతార !
మీకు ప్రాకృతజన దృష్టి ప్రాకకుండ
మంగళా శాసనము సేతుమయ్య ! స్వామి !
రామ ! కృప గొను ! శ్రీరఘు రామ ! రామ ! ౧౨

పరమ పవిత్ర మౌ వానిలో భగవాను
డతి పవిత్రుండని మతి దలంచి
మంగళముల కెల్ల మాధవస్వామియే
సర్వసన్మంగళ స్వామి యనుచు
సకల దేవతలకీ స్వామియే దేవత
సర్వభూతములకు జనకు డతడె
వర త్రికాలజ్ఞాని వ్యాసుడే యనినట్లు
పరమ పవిత్రుడీ హరియటంచు
శార్ఙ్గ ధన్వుడ వౌచు శేషాసనమున
దీప్తి గని వెల్గు పరవాసు దేవ ! మీకు
మంగళా శాసనములివే మాన్య ! గొనుము
రామగిరి ధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౩

దేహాత్మ బుద్ధ్యాది తీవ్రవాదము మాని
సద్గోష్ఠులను జేయు శాంతి దాంతి-
గల ప్రపన్నుని వలె గనగ నీ దాసుడు
శేష భూతుడు నీకు శ్రీవిశేష !
స్త్రీల నాకర్షింపజేయు రూపమె కాదు
పురుషుల చిత్తా పహరణ సేయు
త్రిభువన సమ్మోహ విభవమూర్తివి నీవు
మద్దోషముల నెల్ల మట్టు బెట్టు -

చాలువాడవు మంత్ర రాజంబు నమరు
మంత్ర రత్నాల హారతిన్ మలచి మీకు
మంగళ శాసనము చేతుమయ్య ! స్వామి !
రామ ! కృప గొను శ్రీరఘు రామ ! రామ ! ౧౪

శ్రీసర్వ మంగళా శాసనంబులు మీకు
పరగజేసిన కవి భట్టుపతికి ;
స్వామి ! మీపైనాల్గువందలపై పాట-
లల్లిన శ్రీగీతి నల్లిన సతి-
కాముక్త మాల్యద నాముగ్ధసందోహ
సౌందర్య్య కిడి నయా జనక ఋషికి;
విష్ణుపరత్వమున్ విశదించి పరత త్వ
శుల్కమున్ గొనిన శ్రీశుభ గుణునికి ;
విల్లి పుత్తూరు పురమును వెలుగజేయు
(1) దివ్య విజ్ఞాన ద్యుమణికి; భావ్యమైన-
మంగళము లౌత ! మీ కౌత ! మంగళములు
రామగిరి ధామ ! శ్రీరఘురామ ! రామ ! ౧౫

మీకు శ్రీకిరవైన మీ తిరు మేనుకు ! భవదీయ శుభగుణాస్పదపుమదికి
ఉరమందుచెలువొందు సిరిలచ్ఛిపడతికి ! అవ్యాజ శ్రీమత్కృపౌఘములకు
పరరిపు భీకర పంచాయుధములకు ! భవభయాపహ భవ త్పాదములకు
తావక భృత్యభృత్యాను భృత్యులకును ! త్వత్పద స్థితి దెల్పు పండితులకు
పరమ పదమున్న వైకుంఠపుర వరముకు ! చేరి మిము గొల్చు శ్రీనిత్య -
సూరితతికి
స్వామి ! మా వైన మంగళా శాసనములు ! రామగిరి ధామ ! శ్రీరఘు
రామ ! రామ ! ౧౬

(1) దివ్యవట పత్రశాయికి

మీకు మీతనువుకు మీకౌస్తుభశ్రీకి - చెలువైన శ్రీవత్స చిహ్నమునకు
మీదివ్య శంఖచక్రాది లక్ష్మలకును అనఘభక్తాభయహస్తమునకు ఉభయ
భుజాగ్రాన నొప్పు బాణాసన! బాణతూణీరదివ్యాస్త్రములకు
వికచాబ్జనేత్రాల వీధిలో విహరించు! కారుణ్యలక్ష్మికి ఘనతమీర
మంగళంబులు శుభదసన్మంగళములు వేలజయమంగళమ్ములు వినుతమైన
మహితకల్యాణ విజయసన్మంగళములు! రామగిరిధామ! శ్రీరఘురామ! రామ!
౧౭

ఇయ్యది

శ్రీరామగిరి- శ్రీరఘురామశతపారిజాతప్రబంధమ్మున - శ్రీరఘు-
రామ మంగళాశాసనము - నవమగుచ్ఛము సర్వము శ్రీసీతారఘు-
రామపాదపద్మార్పణమై ముగిసినది

-: శ్రీ శుభంభవతు :-

శ్రీః

శ్రీసీతారామచంద్రస్వామినే నమః

# శ్రీరామగిరి - శ్రీరఘురామ శతపారిజాతప్రబంధము - శ్రీరఘురాముని పదసన్నిధిలో వినమ్రప్రార్థన - దశమగుచ్ఛము

శ్రీభక్తశబరేమి చేసెనోనోములు
(1) పండ్లారగింపిడి బహు తరించె
గుహుండెట్టి వేల్పుల గొలిచెనో కాని మీ-
యడుగులన్ గడిగి పెంపై తరించె
హనుమ యే పూజల నాచరించెనొ కాని
మీ పద భృత్యు డై యేపు గాంచె
సుగ్రీవుడే తపస్సొనరించెనో కాని
మీ తోడి చెలిమితో మీరి వెలిగె
చిక్రోడ మేభక్తి జేసెనో కాని మీ
వాత్సల్యముల గొని వసుధ వెల్గె
పేర్మి నేవ్రతమూనె విభీషణుండు
వరల మీకృప; లంకాధిపత్యమూనె
శక్తుడను గాను నీ పదాసక్తుడనుర !
రామ కరుణింపు శ్రీరఘురామ ! రామ ! ౧

యజ్ఞరక్షణ గోరి యరుదెంచు ముని వెంట
ననుజుతో నరుగు పాదాబ్జములను
రాతియై పడియున్న రమణి యహల్యకు
దగ ముక్తినిడిన పాదాబ్జములను
సీత నిచ్చెడి వేళ సేవించి జనకుడు
కడిగిన శ్రీపాదకమలములను

(1) ఎంగిలి పండ్లిడి యిలతరించె

మిథిలా ప్రజావళి ముదమ్మైన యెడదలు
పలుముద్దులిడిన మేల్పాదములను
పరగ సాకేత పురజనుల్ మురిసిపోయి
భక్తి గొనియాడు కల్యాణ పాదములను
(1) ఆ భవత్పాదములను నాయందునిడవె !
రామ ! నతిజేతు ! శ్రీరఘు రామ ! రామ ! ౨

కౌసల్యయొడిలోన కలిమి ముద్దుల గుల్కి-
కదలాడు మురువైన పదయుగళము
దశరథ భూజాని తన యింటి సిరులని
మది నెంచి తలనిడు పదయుగళము
అనుజన్ము లెల్లప్పుడాదరించుచు నెదన్
ముదమారగొలిచెడి పదముగళము
సీతమ్మ (2) తన మదింజెలిమి పండించెడి-
పంటని ముద్దాడు పదయుగళము
మౌని సద్భక్త మానస మందిరముల
కదలు దీపపు సిరివెల్గు పదయుగళము
ఆ భవత్పాదయుగళి నన్నాదు కొనుత !
రామ ! వినతుడ ! శ్రీరఘురామ ! రామ ! 3

ఎదమచ్చ గల సామి ! యెగుభుజంబుల సామి !
విల్లమ్ము లున్న మా వేల్పు సామి !
దయ లెల్ల వెల్లులై తారాడ చెలువైన
విలువైన మనసున్న విజయరామ !

---

(1) ఆభవత్పాద కమలాల నండ నిడవె !
(2) సీతమ్మ పడకింటి చెలిమిపండించెడి-

సీతమ్మ లక్ష్మన్న చెరియిరువైపులన్
చెలగ వెల్గెడు స్వామి ! చేరికొలుతు
నును దమ్మి కనులలో ఘనమైన కృప వెల్గ
ప్రజల నేల్కొను మేటి స్వామి ! నతులు
భారతమునందు పలు పల్లె పట్టణముల
వాడ వాడల తెలుగుల వాడలందు
వెలు గు శ్రీరామ మందిరంబుల జెలంగు
విశ్వకల్యాణ కరరామ ! వినతి జేతు
రామ ! దయజూడు ! శ్రీరఘు రామ ! రామ ! ౪

నీకు నీ సుదతికి నీ తమ్ములకు భక్త
నిజ జనాళికి సిరుల్ నిల్చుగాత !
నీ క్షేత్రములకెల్ల నీ దేశములకెల్ల
నీ మందిరాలకు క్షేమమగుత !
నీ నామ సాహిత్య నిజవైభవముకెల్ల
నీ చరిత్రకు దీప్తి నిల్చుగాత !
భారత జాతికి బహుళాంధ్ర జాతికి
సకల సౌభాగ్యముల్ సాగుగాత !
పౌరులకు దేశ పాలక వర్గములకు
ప్రభుతకును స్వస్తి యగుత! విశ్వాళి కెల్ల !
శ్రీనివాసుకు మీ కృపా శ్రీలలరుత !
రామ గిరిధామ ! శ్రీరఘు రామ ! రామ ! ౫

ధర్మముల్ దేశమందలరుచున్ వెల్గుత !
ధర నధర్మంబులు తరలుగాత !
న్యాయంబు ప్రభుతలో నరనాయకులలోన
భారతీయత నీతిప్రబలుగాత !

జాతులు మతములు సరియైన ధర్మాల
సాగుచు సమతైక సరళి గనుత !
స్వపర భేదంబుల సమయించి నిస్వార్థ -
తల గల్గి పాలకుల్ ధరణి గనుత !
దేశములు భవ్య స్వాతంత్ర్య దీప్తి గనుత !
మీ కృపల్ విశ్వ వీధులన్ ప్రాకు గాత !
నిల్చి మన్మది నీ వు నన్నేలు గాత !
రామ ! నతిగొను ! శ్రీ రఘురామ ! రామ ! ౬

రఘుపతి పేటలో రాణించు దుందుభీ -
వాహినీ లక్ష్మి పెంపొందుగాత !
తత్తీరమున వెల్గు ధరణి ధరోత్తమ-
శ్రీరామగిరి మేటి శ్రీల గనుత !
అర్చక పాచకాచార్యాది బుధులకు
ఆయురారోగ్యమ్ము లలరు గాత !
క్షేత్ర పాలకులౌచు సేవించు సద్భక్త -
సేవకాళికి శుభ శ్రీ చెలగుత !
పరమ కారుణ్యమూర్తులై ప్రబలు మీకు
సకల కల్యాణ విభముల్ జరుగుగాత !
రామ ! మీ కీర్తి భువిలోన రక్తి గనుత !
రామగిరి ధామ ! శ్రీరఘురామ ! రామ ! ౭

సాధు సజ్జనులకు సద్భక్తులకు ప్రజా
వళికి శుభంబులు వరలుగాత !
న్యాయ సద్ధార్మిక నైతికవిలువతో
ప్రభువుల పాలనం బలరు గాత !

భారత జాతికి పరమ పవిత్రమౌ
(1) గోద్విజాళులకు నుసాధ్యులకును
స్వస్తియౌ; సంస్కృతీస్వాంత భారతికెల్ల
ఆంధ్రావనికి శ్రీలున లరుగాత!
మీకు మీ మందిరశ్రీకి మీ పదాబ్జ -
సకల భృత్యాది సజ్జనార్చకులకెల్ల
ఆయురారోగ్య సంపదలలరుగాత!
రామగిరి ధామ! శ్రీరఘు రామ! ౮

ఓ రాఘవా! యని నోరార బిలిచితి
మన్నించి నేరాలు, నన్ను బ్రోవు
నన్ను నీ వానిగా నెన్నుచు నెదలోన
మోదంబులందించి పూని కావు
రాజీవలోచనా! రక్షింతు వీవని
మది నమ్మిచేరితిన్ సదయ! యేలు
చంద్రాచ్ఛ చంద్రికా సాంద్రయశోరమ్య!
యతి మనోవేద్య! సన్నుతుని గాంచు
సీత మాతల్లి పేర్మిచి ''త్రా'' తతాబ్జ-
రాజితమిళింద! దశరథరాజ ''మా,,న్య
యజ్ఞ ఫల! జయైకరామ!
రామ గిరి ధామ! శ్రీరఘురామ! రామ! ౯

భక్తి ప్రపత్తితో ప్రతి దినంబున శ్రద్ధ
గల్గి విశ్వాసాన కాంక్షదీర
రాముడౌ మీ పద రాజీవముల మదిన్
మనసార పేర్మితో మనన జేసి
శ్రీనివాసకృతైక శ్రీ ''రఘు రాముని''
శతపారితమున్ సాధుభక్తి
పఠియించు వారికి భవరోగబంధాలు
తాపత్రయాదులు తరలిపోవు
దురిత రిపు షట్కముల బాధ తొలగిపోవు
ఇహ పర శ్రీల సౌభాగ్య మెదగి యాడు
జన్మ రాహిత్యమౌను నిజమ్ము యిద్ది
రామగిరి ధామ ! శ్రీరఘు రామ ! రామ ! ౧౦

ఇయ్యది

శ్రీనల్లదీగాన్వయ పంజాతుండైన భారద్వాజస గోత్ర పవిత్రుండైన త్రుపన్నుండైన శ్రీమాన్ నల్లదీగ నరసింహాచార్య చూడ మాంబాతనూజుండైన చతుస్సహోదర పరివృతుండైన ''శ్రీకవితా కోవిద'' ఇత్యాది బిరుదాంకితుండైన రాధికామనోహరీ యహాద్యనేక కృతి నిర్మాణ దక్షుండైన శ్రీలక్ష్మీ హయవదనానుగ్రహసంభూషితుండైన శ్రీవాసరసరస్వతీదయా లంకృతుండైన శ్రీ ఇందిరాల శ్రీరుక్మిణీ సత్యాభామా గోదాసమేత శ్రీ రాజ గోపాల పాదారవి ంద సేవాతత్పరుండైన శ్రీమన్నారాయణ చరవారవిందదాసాను దాసదాసుడైన శ్రీనివాసకవి చే విరచితంబైన ''శ్రీరఘు రామ శతపారిజాత ప్రబంధము'' న శ్రీరామగిరి రామచంద్ర స్వామి వారి వినమ్రసంస్తుతి అను దశమ గచ్ఛము సర్వము శ్రీరామగిరిసీతారామపాదపద్మార్పణమై ముగిసినది.

శ్రీశుభంభవతు

స్వస్తియగుగాత ప్రజలకు ప్రభుతకెపుడు న్యాయమార్గాలచే
ప్రజానాయకాళి;
సాగజేయుత ప్రభుతను; సాధుజగతి; గోద్విజాదులు శుభము
లన్గూర్మి గనుత!

సర్వేజనాస్సుఖినోభవంతు

ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః

ఓం తత్సత్

శ్రీః

శ్రీరస్తు　　　　　　శ్రీః　　　　　　శ్రీశుభమస్తు

శ్రీలక్ష్మీహయవదన పరబ్రహ్మణేనమః

శ్రీవాగీశ్వర్యైనమః

శ్రీసీతాలక్ష్మణ హనుమత్సమేత శ్రీరామచంద్రస్వామినేనమః

శ్రీరామ భూధర పతింశ్రిత పారిజాతం
కారుణ్య పూర్ణ విలస - త్కమలాయతాక్షం
సీతా సుమిత్ర తనయానిలజాను సేవ్యం
శ్రీరామరాఘవపతిం ప్రణమామి దేవమ్

శ్రీపాలమూరు (మహబూబునగర) మహామండలాంతర్గత
శ్రీరఘుపతిపేట సమీప దుందుభీనదీతీరోపాంత
శ్రీరామగిరి మన్దిరే విరాజమాన
శ్రీసీతాలక్ష్మణ హనుమత్సమేత-

# -: శ్రీరాఘవపతి సుప్రభాతమ్ :-

రచయిత


శ్రీమాన్ నల్లదీగ శ్రీనివాసాచార్యః (ఎం. ఓ. యల్)
(ఇందిరాల గ్రావాసీ)
సికింద్రాబాద్ శ్రీమహబూబు కళాశాలా విశ్రాంత ప్రధానాంధ్రాధ్యాపకః



శ్రీమదార్ష కళాభారతీ గ్రంథమాలా ప్రచురణమ్
శ్రీధాత. నామ. సం. హేమంతశశిరౌ (1997)

శ్రీమదార్షకళాభారతీనిలయప్రసూనమ్ :-

గ్రంధము : **శ్రీరాఘవపతిసుప్రభాతమ్ ఇతి**

గ్రంధకర్తా : శ్రీమాన్ నల్లదీగ శ్రీనవాసాచార్యః

ఇందిరాలగ్రామః, తా. భువనగిరిః, జి. నల్లగొండ,

మాడలమ్‌భూదానపోచంపల్లి

(సికింద్రాబాద్ మహబూబుకళాశాలాయాం

విశ్రాంత ప్రధానాంధ్రాధ్యాపకః)

రచనాసమయము : శ్రీధాతృ. సం. హేమంతశశిరా 1997

కృతిభర్తా : శ్రీరామగిరిరామచంధ్ర స్వామీ

ప్రతయ : ౧000

మూల్యం : రూ.15/-

గ్రంధముద్రణ సహకారము :

టి. టి. దేవస్థానమ్ తిరుపతి హిందూధర్మ ప్రచారసమితి.

గ్రంధముద్రణస్థళము : **శ్రీపద్మావతీ ఆఫ్‌సెట్ ముద్రణాలయమ్**

న్యూబాకారం - హైదరాబాదు. ఫోన్ : 7611413

లేజర్‌టైప్‌సెట్టింగ్: శ్రీసాయిమేధ కంప్యూటర్ క్రియేషన్స్

కూకట్‌పల్లి, హైదరాబాద్. ఫోన్: 3068708.

శ్రీః

శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీ మహా సరస్వత్యై నమః

శ్రీ సీతాలక్ష్మణ హనుమత్సమేత శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

శ్రీ రామగిరి-

# -: శ్రీ రాఘవపతి సుప్రభాతమ్ :-

## -::సంస్తుతి::-

శ్రీ దుందుభీ వర నదీ తట రమ్యదేశే
శ్రీ రామ భూధర మనోహర మందిరే స్మిన్
రాజత్ప్రపన్న జన మంజుల పారిజాతః
సీతామనోహర విభు ర్హృది మే చకాస్తు ౧

సాకూత సుస్మిత ధరాతనయాభిరామం
సౌమిత్రిణా నిలజ సేవిత పాదపద్మం !
భక్తై ర్నుతం మహిత రామ గిరీంద్రవాసం
రామాద్రిరాఘవ పతిం ప్రణమామి నిత్యమ్ ౨

మాయా మనుష్య సుగుణాశ్రయ దివ్య రూపం
ధర్మావతార మనఘం భువనాధినాథం
ధర్మ స్వరూప మనవద్య దయార్ద్రచిత్తం
శ్రీ మైథిలీ విభు మనన్య ధియా ప్రణౌమి ౩

రమ్యేంద్ర నీల శకలో ల్లలితాల కాగ్రం
దివ్యల్లలాట ఫలకే లలితోర్ధ్వపుండ్రం
రత్నప్రభాఢ్యమకు టోజ్జ్వలితోత్తమాగం
శ్రీ జానకీ రఘుపతిం మనసా భజామి ౪

దోస్సార దుర్మద ఖ లాసుర భీమరూపం
కోదండ మండిత మహోన్నభాహుదండం
కాకుస్థవంశ తిలకం కరుణాంతరంగం
సీతాపతిం రఘుపతిం ప్రణమామి రామమ్ ౫

శ్రీ కోసలేశతనయా వరగర్భశుక్తి
ముక్తా ఫలం చ రఘువంశకుల ప్రదీపం
కారుణ్య పూర్ణ కమలా యత చారు నేత్రం
శ్రీరామ భూధర విభుం ప్రణమామి రామమ్; ౬

రమ్యేంద్ర నీల సమ నీరద నీలదేహం
సౌందర్య సార జలధిం జితమారకోటిం
ధర్మాకృతిం వినుత ధాశరథిం ప్రసన్నం
శ్రీరామ భూధరపతిం ప్రణమామి దేవమ్ ౭

శ్రీ శ్రావణోజ్జ్వలతటిజ్జలదాభ నీలం
సౌందర్య కోమల తనుం నుతదీర్ఘబాహుం
శ్రీశారదేందువదనం శ్రితకల్పభూజం
రామాద్రి మందిర విభుం ప్రణమామి దేవమ్ ౮

శ్రీదుందుభీ వర నదీ తట రమ్య దేశే
సన్మంగళే విజయరామ గిరీంద్ర భవ్యే
శ్రీమందిరే విలసితం ధరణీ సుతాఢ్యం
శ్రీరామ శైల విభు మాత్మని నౌమి నిత్యమ్ ౯

ఇదం త్రిభువనార్చితం పరమ భక్త సంరక్షకం
ప్రపన్న జనమానసాంబుజ సమర్చనై ర్మానితం !
సదా మమ హృదంబుజే లసతు రాఘవాంఘ్రిద్వయమ్
ముదా రహసి సీతయా మధుర చుంబనై ర్మా నితమ్ ౧౦

శ్రీరామభద్ర శ్రిత కల్పవృక్షః
లోకైక కల్యాణ గుణై ర్మనోజ్ఞః
శ్రీమైథిలీ మానస పద్మ భృంగః
సుఖప్రదం మంగళ మాతనోతు ౧౧

రామాయ రాఘవేంద్రాయ ! కరుణారససిందవే
శ్రీరామ శైలవాసాయ - సీతారామాయ తే నమః

- శ్రీదుందుభీ నదీతీరే - శ్రీరామగిరిమన్దిరే
శ్రీసీతాలక్ష్మనాఢ్యోసౌ శ్రీరామో జయతాం భువి
శ్రీసీతా సూరి సౌమిత్రి వాయుజై స్సేవిత ప్రభుః
భక్తై స్సమర్చితో రామః వర్ధతా మభివర్ధతామ్

శ్రీదుందుభీనదీతీరోపాంత శ్రీరామగిరి
శ్రీః
శ్రీసీతాలక్ష్మణ సమేత శ్రీరామచంద్రస్వామినే నమః

శ్రీ య్యైనమః　　　　శ్రీః　　　　శ్రీ సరస్వత్యైనమః

శ్రీ లక్ష్మీహయగ్రీవాయనమః

శ్రీ రామగిరి -

శ్రీ సీతాలక్ష్మణ హనుమత్సమేత శ్రీ రామచంద్రాయనమః

శ్రీ దుందుభీ నదీతీరోపాంత శ్రీ రామగిరి -

# -:)0(: శ్రీ రాఘవపతి సుప్రభాతమ్ :)0(:-

కౌసల్యా సుప్రజా ! రామ !
పూర్వా సంధ్యా ప్రవర్తతే।
ఉత్తిష్ఠ నర శార్దూల !
కర్తవ్య దైవ మాహ్నికమ్॥

ఉత్తిష్ఠోత్తిష్ఠ రామాద్రి వాస ! శ్రీపతగధ్వజ !
ఉత్తిష్ఠ మైధిలీ రామ ! విశ్వైకం మంగళం కురు॥

తా॥ ఓ రామగిరి వాసా ! ఓ పతగకేతనా ! లేవవయ్యా ! లెమ్మ
ఓ మైధిలీ రామ ! లెమ్మ విశ్వమునకు మంగళమును గూర్చుము :- ౨

జయ శ్రీ రాఘవ స్వామిన్ !
జయ శ్రీ రఘు నాయక !
సుప్రభాతా నిశా తే స్తు
నమో జాగృహి జాగృహి.

తా॥ ఓరాఘవ స్వామీ ! జయము, ఓ రఘునాయకా ! జయము. నీకు సుప్రభాతమగుగాక , జాగృతిని పొందుము. నీకు నమస్సులు;

మాత స్సతీ వసుతీ వర గర్భ శుక్తి -
ముక్తాఫలే ! రఘుపతేః పద పద్మ భృంగి !
శ్రీనాయికే ! జనకరాజ ఋషి ప్రసూతే !
శ్రీ రామ చంద్ర దయితే ! తవ సుప్రభాతమ్ ! ౧

తా॥ ఓ తల్లీ! భూదేవి యొక్క గర్భశుక్తి ముక్తాఫలమా! శ్రీరాముని పాద పద్మయుములలో విహరించు భృంగమా! ఓ జనకరాజర్షిసంతాన మా! ఓ లక్ష్మీ స్వరూపురాలా! శ్రీరామ చంద్ర స్వామి వారియిల్లాలా! నీకు ఇదిగో! సుప్రభాతము!

తవ సుప్రభాత మనవద్య మానసే!
భవతు ప్రసన్న లలితాబ్జలోచనే!
దివిజ్యా జ శూలి వనితాభి రర్చితే!
రఘునాయకార్యదయితే! దయానిధే! ౨

తా॥ ఓ చక్కనైన మనసు గలదానా! నిర్మలమైన చక్కనైన కమలములవంటి నేత్రములు గలదానా! దేవతలు బ్రహ్మ శివుడు మొదలగువారి స్త్రీలచే పూజింపబడుదానా! శ్రీ రఘునాయక స్వామి వారి యిల్లాలా! దయకు నిధివైనదానా! నీకిది గో! సుప్రభాతము!

శ్రీదుందుభీ కలిత రామ నగాధివాస!
తత్రత్య భక్త జన సేవిత రామచంద్ర!
శ్రీమత్ప్రపన్న విబుధా ర్చితపాదపద్మ!
రామాద్రిరాఘవ పతే! తవసుప్రభాతమ్. 3

తా॥ దుందు భీనదితో కూడియున్న రామగిరిలో నివసించినవాడా! ఆ ప్రాంతమున నున్న భక్తజనులచే సేవింపబడుచున్న రామచంద్రా! ప్రపన్నులైన పండితులచే అర్చింపబడుచున్న పాదపద్మములు గల వాడా! ఓ రామగిరి రాఘవపతీ! ఇదిగో! నీకు సుప్రభాతము

కాకుస్థ వంశకలశోదధి పూర్ణ చంద్ర!
భక్తావనైక పరిపూర్ణ కృపాసముద్ర!
బ్రహ్మామరేంద్రసురసన్ను తకీర్తి సాంద్ర!
శ్రీరామ భూధరపతే! తవసుప్రభాతమ్! ४

తా॥ కాకుస్థ వంశమను సముద్రమునకు పూర్ణ చంద్రుని వంటివాడా ! భక్తులనే ముఖ్యముగా కాపాడు కృపాసముద్రుడా ! బ్రహ్మ ఇంద్రుడు దేవతలచే కొనియాడబడిన దట్టమైన కీర్తి గలవాడా ! ఓ రామగిరి ప్రభూ! నీకు సుప్రభాతము.

శ్రీరామ చంద్ర ! విహితాశ్రితపాజాత !
ఆర్తా భయప్రదకరాంబుజ ! రాజరాజ !
ధూర్తారి భంజక శరాసన సాయకాఢ్య !
రామద్రి రాఘవపతే ! తవ సుప్రభాతమ్ ! ౫

తా॥ ఓ రామచంద్ర ! ఓ ఆశ్రితపారిజాతమా ! ఆర్తులకునభయప్ర దుడా ! ఓ చక్రవర్తీ ! ధూర్తులైన శత్రువులను నశింపజేయు ధనుర్బా ణములు కలవాడా ! ఓ రామగిరి రాఘవ ప్రభూ ! నీకు సుప్రభాతము

శ్రీరామ ! రామ ! రఘువంశకులాబ్ధి సోమ !
కారుణ్య ధామ ! కమనీయ గుణాభి రామ !
కోదండ మండిత భుజోన్నత చారు సీమ !
శ్రీరామ! రాఘవ పతే ! తవ సుప్రభాతమ్॥ ౬

తా॥ ఓ శ్రీరామ ! రఘు కులమనెడి సముద్రమునకు చంద్రుని వంటివాడా ! ఓ కారుణ్య నిలయా ! చక్కనైన గుణములచే సొగసైనవాడా ! కోదండముచే అమంకరింపబడిన చక్కని భుజ సీమ గలవాడా ! ఓ శ్రీరామగిరిప్రభూ ! నీకు సుప్రభాతము.

శ్రీరామచంద్ర ! కరుణాంబుధిపూర్ణసాంద్ర!
సీతా సతీ చరణ పంకజ చంచరీక !
ధర్మావతార ! రణ దీర ! సుధీవిచార !
శ్రీరామ భూధరవిభో ! తవ సుప్రభాతమ్ ! ౭

తా॥ ఓరామచంద్రా ! దయా సముద్రముచే దట్టమైనవాడా. సీతాదేవి పాదకమలములలో విహరించు భృంగరాజమా ! ఓ ధర్మావతారా ! రణ దీరుడా ! సద్విచారము గలవాడా ! ఓ రామశైలవిభూ! నీకు సుప్రభాతము.

మాయామనోజ్ఞవర మానుష దివ్యరూప !
శ్రేయస్కరోరు శరచాప ! లసత్ప్రతాప !
దుర్వార ఘోరభవతారక నామ దీప !
శ్రీరామ రాఘవపతే ! తవసుప్రభాతమ్ ! ౮

తా॥ ఓ మాయా మానుష స్వరూపుడా ! శ్రేయస్కరములైన ధనుర్బాణములు గలవాడా ! ఓ ప్రతాపవంతుడా ! వారింపరాని భయంకరమైన సంసారమును తరింపజేయు నామములతో వెలుగువాడా ! ఓ రామ - గిరి రాఘవపతీ ! నీకు సుప్రభాతము.

స్నాత్వా ప్రభాతసమయే హితభక్తి భావైః
భక్తైర్హితాకవరై ర్విబుధైఃప్రశస్తైః !
ఆరాధనా విధిభి రర్చిత పాదపద్మ !
శ్రీరామ భూధర పతే ! తవసుప్రభాతమ్ ! ౯

తా॥ భక్తి భావముతో ఉదయముననే లేచి స్నాన మొనర్చి భక్తులైన అర్చన స్వాములతో విబుధులతో ఆరాధనావిధులచే చక్కగా అర్చింపబడు పాదపద్మములు గలవాడా ! ఓ రామగిరిపతీ ! నీకు సుప్రభాతము.

బ్రహ్మా మరేంద్ర గిరి శా౽మర దిక్పతీనాం
మౌళి ప్రశస్తమణి రత్న మయూఖజాలైః
సమ్యక్సమర్చిత పదద్వయ పాదపీఠ !
శ్రీరామమభూధరవిభో ! తవ సుప్రభాతమ్ ॥ ౧౦

తా॥ బ్రహ్మ ఇంద్రుడు రుద్రుడు దేవతలు దిక్పతులు మొదలగువారి యొక్క కిరీటములందలి మణులకాంతులతో బాగుగా అర్చింపబడిన పదపద్మములు గల పాద పీఠముగలవాడా ! ఓ రామగిరి రాఘవవిభూ ! నీకు సుప్రభాతము.

మౌనీంద్ర కౌశిక వశిష్ఠ తపోధనాఢ్యాః
స్నాత్వా ప్రభాతసమయే విహితార్ఘ్యహస్తాః
త్వద్దర్శ నార్థ మిహ సంప్రతిపాలయ న్తి
శ్రీరామ! రాఘవపతే ! తవసుప్రభాతమ్ ! ౧౧

తా॥ ముని శ్రేష్ఠుడైన విశ్వామిత్రుడు వశిష్ఠుడు మొదలగు తపోధనులు ఉదయముననే లేచి స్నానము చేసి పూజార్ఘ్యములు గల వారై మీ దర్శనార్థముకొఱకై ఇచ్చట ఎదిరి చూచుచున్నారు. ఓ రామ ! రాఘవపతీ ! నీకు సుప్రభాతము.

అత్ర స్థితాన్ విహిత ధార్మిక భక్త లోకాన్
సంతారణార్థ మిహ దేవ ! కృతావతారః
కింవా వదామి భవదీయ కృపాంతరంగం
శ్రీరామభూధర పతే ! తవసుప్రభాతమ్. ౧౨

తా॥ ఇచ్చట గల యోగ్యులు ధార్మికులునైన భక్తులను రక్షించుట కొఱకే ఈ గిరిపై అవతరించినవాడవైతివి. నీ కృప గల హృదయమును గూర్చి ఏమని చెప్పుదును? ఓ రామగిరి రాఘవపతీ! నీకు సుప్రభాతము.

అజ్ఞాన గాఢతిమిరస్థ జనావనార్థం
విజ్ఞాన పూర్ణ భవదాకృతి రద్వితీయః
దాక్షిణ్య పూర్ణ కృపయా చ సమావిరాసీత్
శ్రీరామ భూధర విభో ! తవ సుప్రభాతమ్॥ ౧౩

తా॥ అజ్ఞానపు చీకటిలో నున్న జనులను రక్షించుటకొఱకు విజ్ఞానముతో నిండిన నీ యాకృతి సాటిలేనిది. దాక్షిణ్యముతో నిండిన కృపతో ఆవిర్భవించినవాడవైతివి. ఓ రామగిరి విభూ ! నీకు సుప్రభాతము.

మౌనీంద్ర చిత్త వివశీకర ముగ్ధ రామ !
వాత్సల్య పూర్ణ విలస న్నయనా భిరామ !
దుర్దైత్య దానవ మదాంతక శౌర్యసీమ !
రామాద్రి రాఘవపతే ! తవ సుప్రభాతమ్ ! ౧౪

తా॥ మునులమనస్సుల వశము చేసికొను ఓ సౌందర్య రామ ! వాత్సల్యముతో నిండిన నయనములచే చక్కనైనవాడా ! దైత్యుల మదమడంచు శౌర్యము గలవాడా ! ఓ రామగిరి రాఘవ పతీ ! నీకు సుప్రభాతము.

ప్రాచీ వధూ లలిత నృత్య పదాబ్జశింజా
ప్రస్తైవ పూర్వ ది శి భాతి చ కోణ తారా
రాగావ గుంఠన పరా చ విభాతలక్ష్మీ
శ్రీరామ భూధరవిభో ! తవ సుప్రభాతమ్ ! ౧౫

తా॥ తూర్పు పడతి నాట్యమాడ పాదములందలి గజ్జె జారినది వలెనే మూల చుక్క తూర్పు దెసన వెల్గొందినది. ఉదయలక్ష్మి అను రాగముచే యెఱుపైన ముసుగు ధరించినది. ఓ రామగిరి విభూనీకు సుప్రభాతము.

ప్రాగ్భామినీ లలిత రాగ లలాట దేశే
రాగా నుబద్ధ మనసాచ చుచుంబ భాస్వాన్
శాంత్యాశ్రయా భవతి భవ్య దిగంత లక్ష్మీ
శ్రీరామభూదరవిభో ! తవ సుప్రభాతమ్. ౧౬

తా॥ తూర్పు పడతి యొక్క చక్కనైన రాగమయమైన ఫాలభాగమునందు అనురాగముతో కూడిన మనస్సుతో సూర్యుడు ముద్దుపెట్టినాడు, దిగంతముల శోభ శాంతము నాశ్రయించినది. ఓ రామగిరి రాఘవవిభూ ! నీకు సుప్రభాతము !

సప్తర్షయ స్సకల భక్త గణాశ్చ దివ్యాః
స్నాత్వా ప్రభాత సమయే సకలార్ఘ్య యుక్తాః !
ద్వారే వసంతి తపవ దర్శన మర్థయస్తే
శ్రీరామ భూధరపతే ! తవ సుప్రభాతమ్. ౧౭

తా॥ సప్తర్షులు భక్త గణ ములు దేవతలు ఉదయముననే స్నానమొనర్చి అర్ఘ్యములతో కూడి మీ దర్శనముకొఱకు ద్వారమున వేచి యున్నారు. మీ దర్శనము నర్థించుచున్నారు. ఓ రామగిరి విభూ ! నీకు సుప్రభాతము.

పున్నాగ నాగ జలజామ్ర తమాల నీప
ప్రోత్ఫుల్ల కుంద కదళీ తులసీ వనేభ్యః
మందం చలంతి మలయాచలగ న్ధవాహాః
శ్రీరామ ! రాఘవపతే ! తమ సుప్రభాతమ్. ౧౮

తా॥ పున్నాగములు నాగములు పద్మములు మామిడి కానుగు వేప మల్లె అరటి తులసి మొదలగు వనముల నుండి మలయవాయువులు మెల్లగా సాగుచున్నవి. ఓ రామ ! రాఘవపతీ ! నీకు సుప్రభాతము.

పల్లీయ గేహ నిచయే దధి మధ్న ఘోషాః
దోషాన్ విదార్య తవ శాబ్దిక దివ్యదీప్తిం
సమ్య క్ప్రహంతి శృణు దాశరథే ! ప్రబుధ్య
శ్రీరామ భూధరవిభో ! తవ సుప్రభాతమ్ ! ౧౯

తా॥ గొల్ల పల్లెలలోని యిండ్లలో పెరుగుచిలుకుచున్నసవ్వళ్ల దోషము లను చీల్చి నీ యొక్క రామనామ శబ్దదీప్తిని వహించుచున్నవి. ఓ దాశ రథీ! మేల్కొని వినుము. ఓ రామగిరి విభూ! నీకు సుప్రభాతము.

దేవర్షయ స్స కలవైణికగాయకాద్యాః
విద్యాధరా ప్సరస సిద్ధ గణాశ్చ గీతైః
నృత్యాదిభి ర్వినుతిభిః ప్రతిపాలయన్తే
రామాద్రి రాఘవపతే! తవసుప్రభాతమ్. ౨౦

తా॥ దేవఋషులు, వైణికులు, గాయకులు, విద్యాధరులు, అప్సరసలు, సిద్ధులు చక్కని గీతములతో నాట్యములతో స్తుతులతో మీ దర్శనముకై వేచియున్నారు ఓ రామగిరిరాఘవపతీ! నీకు సుప్రభాతము.

భవ్యోర్ధ్వపుండ్ర తులసీ నళినాక్షమాలాః
శ్రీవైష్ణ వా స్సలిల హేమఘటాని నీత్వా
ద్వారే వసంతి భవదర్శన మర్థయన్తే
శ్రీరామభూధరవిభో! తవ సుప్రభాతమ్! ౨౧

తా॥ ఊర్ధ్వపుండ్రములు తులసి నళినాక్షముల మాలలు ధరించి శ్రీ వైష్ణవులు బంగరు ఘటములతో జలమును తీసికొని మీ యర్చనకై ద్వారమున వేచి యున్నారు, ఓ రామగిరి విభూ! నీకు సుప్రభాతము.

భక్తి ప్రపత్తి గుణ భూషిత సాధు భక్తాః
సేవాపరా స్సుకృతయ స్సనకాది ముఖ్యాః
స్తుత్వా త్వదీయ పదర్శన మర్థయన్తే
శ్రీరామ రాఘవపతే! తవసుప్రభాతమ్ ౨౨

తా॥ భక్తి ప్రపత్తులు గల సాధువులు భక్తులు సేవాపరులు సుకృతులు సనకసులు మొదలగు ముఖ్యులు స్తుతించుచు మీ పాదదర్శనమును అర్థించుచున్నారు! ఓ రామగిరి రాఘవపతీ! నీకు సుప్రభాతము!

కోదండ దివ్య శరశోభిత బాహు యుగ్మ!
రత్నాఢ్య హేమమయమౌళి మనోజ్ఞమూర్తే!
సీతా సుమిత్రతత య్యా నిలజ్యాఢ్య! రామ!
శ్రీరామ భూధరవిభో! తవ సుప్రభాతమ్. ౨౩

తా॥ శరచాపములతో శోభిల్లు భాహువులు గలవాడా! రత్నఖచితమైన బంగరు కిరీటములవాడా! సీతాలక్ష్మణ హనుమలతో కూడిన వాడా! ఓ రామ! రామగిరి విభూ! నీకు సుప్రభాతము.

ధర్మా వనార్థమవనీ దురిత ప్రకోప -
భారాపనోదన కృతైక దశావతార!
మాయా మనోజ్ఞ వర మానుషధీర రూప!
సీతామనోహర! విభో! తవసుప్రభాతమ్! ౨౪

తా॥ ధర్మమును రక్షించుటకొఱకు భూదేవి పాపభారమును తొలగింప జేయుటకై అవతరించిన దశావతార స్వరూపా! ఓ మాయామానుష రూప! సీతా మనోహరా! విభూ! నీకు సుప్రభాతము.

కల్యాణ రామ! కమనీయ గుణాభి రామ!
కాకుస్థ రామ! రవి వంశసుధాబ్దిసోమ!
కోదండ రామ! రిపు భీమ! జయైకరామ!
శ్రీరామ! రాఘవపతే! తవసుప్రభాతమ్! ౨౫

తా॥ ఓ కల్యాణ రామా! గుణ సౌందర్యము గలవాడా! ఓ కాకుస్థరామ! సూర్యవంశమను పాలసంద్రమునకు చంద్రుడవైనవాడా! ఓ కోదండరామా! శత్రువులకు భయంకరుడ వైనవాడా! ఓ జయరామా! ఓ రాఘవపతీ! నీకు సుప్రభాతము!

ఇత్థంచ యే సుకృతయ స్సతతం ప్రభాతే
దివ్యంచ రాఘవ పతే ర్వర సుప్రభాతం !
భక్తి ప్రపత్తి సుధియా చ పఠన్తి నిత్యం
తే ప్రాప్నువన్తి సతతం పురుషార్థసిద్ధిమ్ ! ౨౬

తా॥ ఈ విధముగ యేసుకృతాత్ములు ప్రతినిత్యము ఉదయవేళలో రాఘవ పతి యొక్క సుప్రభాతమును భక్తి ప్రపత్తులతో చక్కని బుద్ధితో పఠించుచుందురో వారెల్లప్పుడు చతుర్విధ పురుషార్థములను పొందుచున్నారు.

ఇత్థమ్
శ్రీరామగిరి నివాస శ్రీరాఘవపతి సుప్రభాతం సమాప్తమ్
సర్వం శ్రీరాఘవపతి పాదపద్మార్పణ మస్తు
-:ః) ఓంతత్సత్( ః:-
ఈ విధముగ
శ్రీరామగిరి ని వాసుండైన శ్రీరాఘవపతి యొక్క సుప్రభాతము
సమాప్తము. సర్వము శ్రీరాఘవపతి పాదపద్మార్పణమై
విలసిల్లుగాత
శ్రీశుభంభవతు
ఓం తత్సత్

శ్రీః
శ్రీ హయగ్రీవాయ నమః
శ్రీ రామచంద్ర పరబ్రహ్మణే నమః

# శ్రీ రాఘవపతి స్తోత్రమ్

ధరణీతనయా హృదయాబ్జనట
ద్వర సుందర మత్త మిళిందపతే !
నిరవద్య సితాంబుజలోచన ! తే
విజయోస్తు ధనుర్ధర ! రామవిభో !

తా॥ సీతాదేవి హృదయకమలమున నటించెడు సుందరమైన తుమ్మెద రేడా ! స్వచ్ఛమైన తెల్లతామరలబోలు కన్నులుగలవాడా ! ఓ ధనుర్ధారీ ! రామ ప్రభూ ! నీకు విజయమగుగాత !

అనవద్య తటి ల్లలితాశ్రయ స
ద్ఘన నీల ఘనాఘన రమ్య తనో !
ఇన వంశ కులోత్తమ ! విశ్వపతే !
విజయీభవ రామ గిరీంద్ర విభో !

తా!! మెఱుంపుతో కూడిన నల్లని మేఘము బోలు చక్కని శరీరముగలవాడా ! ఓ సూర్య వంశోత్తమా ! విశ్వప్రభూ ! ఓ రామగిరివిభూ ! విజయుడవగుము!

పృధివీ తనయా కుచ కుంకుమ స -
ద్ఘన చందన చర్చిత దివ్య నీల తనో !
నవమోహన మన్మథ మన్మథ ! మాం
వర రామ గిరీశ్వర ! పాహి విభో !

తా॥ సీతాదేవి పాలిండ్లపై గల చందనముచే చర్చింప బడిన దివ్యనీలశరీరము గలవాడా ! ఓ నవమోహనా ! మన్మథుని గన్న మన్మథుడా ! ఓ ప్రభూ ! రఘురామా ! రామగిరీశ్వరా ! రక్షింపుము.

కరుణైక రసార్ణవ పూర్ణ లస -
న్నిర్వద్య నవాంబుజ లోచన ! మాం
శరదిందు శుచి స్మిత రమ్య-నట
ద్వర ముగ్ధ కళానన ! పాహి విభో ! ౪

తా॥ కరుణా సముద్రముతో నిండిన కమల నేత్రములు గలవాడా ! శరత్కాల చంద్రునివలె స్వచ్ఛమైన చిరునవ్వుచే అందమైన మోము గల వాడా ! రామగిరివాసా ! ఓ ప్రభూ ! నన్ను పాలింపుము !

పరిపూర్ణ కృపారస మానస ! మాం
శరణాగత వత్సల పాహి హరే !
ధరణీ తనయా బుధ లక్ష్మణ స-
న్మరుతాత్మజ సేవిత రామ ! విభో !

తా॥ కృపతో నిండిన మనస్సు గలవాడా ! శరణన్న వారిని రక్షించెడి వాత్సల్య గుణము గలవాడా ! సీతా లక్ష్మణ ఆంజనేయులతో సేవింపబడు రామ విభూ ! నన్ను రక్షింపుము.

భువనా వన ధార్మిక చారు గుణిన్!
భవ సాగర తారక నామ తతే !
మునిరాజ మనో హర ముగ్ధ తనో !
వర రామ గిరీశ్వర ! పాలయ మామ్! ౬

తా॥ త్రిభువనముల రక్షించు ఓ దార్మికమైన చక్కని గుణవంతుడా ! సంసార సాగరములను తరింపజేయు నామములు గలవాడా ! మునులను మోహ పెట్టు శరీర సౌందర్యము గలవాడా ! ఓ రామగిరిప్రభూ ! నన్ను రక్షింపుము.

రణ ధూర్త సుర ద్విష భీకర ! హేగి-
ప్రణుంతార్త జనావన సాధు మతే !
గణనీయ శుభంకర నామ గుణిన్ !
ప్రణవా శ్రయసుందర ! పాలయ మామ్ ౭

తా॥ రణ ధూర్తులైన రాక్షసులకు భయంకరమైనవాడా ! నమస్కరించు బాధాగతులను రక్షించు బుద్ధిగలవాడా ! గణనీయములైన శుభకరములైన నామ గుణములు గలవాడా ! ప్రణవము నాశ్రయించి యున్న చక్కనివాడా ! నన్ను పాలింపుము.

బల శౌర్య పరాక్రమ ధీర గుణిన్ !
నవ నీరద సుందర నీల తనో !
శరదివ్య ధనుర్ధర ! సారమతే !
వరరామగిరీశ్వర ! పాలయమామ్ ! ౮

తా॥ బలము శౌర్యము పరాక్రమము గల ధీరుడా ! మేఘమువంటి చక్కనైన నీలి శరీరము గలవాడా ! దివ్యధనుర్బాణముల ధరించెడివాడా ! ధీరగుణము గలవాడా ! రామగిరి ప్రభూ ! నన్ను పాలింపుము

శరణాగత వత్సలతాది మహా -
ద్భిరుదాంకిత ! దీవ్యదుదారమతే !
పితృ భక్తి పరాయణ ! పాలయమాం
కరుణాశ్రయ ! రామ గిరీంద్ర విభో ! ౯

తా॥ శరణాగతులపై వాత్సలమున్న బిరుదము గలవాడా ! ఓ ఉదారగుణము గలవాడా ! పితృ భక్తిపరాయణుండా ! ఓ కరుణామయ ! రామగిరీంద్రవిభూ! నన్ను పాలింపుము.

విమలౌ జలజోదర తామ్ర నిభౌ
లలితౌ భువనా వన పుణ్య ధనౌ
మహితౌ భవతారక సన్మహిమౌ
చరణౌ తవ దర్శయ మే చ హితౌ ౧౦

తా॥ స్వచ్ఛమైనవియు, కమలగర్భములోని యెఱుపు గలిగినవియు చక్కనైనవియు; భువనముల రక్షించు పుణ్యధనములు గలవియు; గొప్పవైనవియు, సంసారమును తరింపజేయు మహిమగలవియు, వినుతములైన మీ చరణములను నాకు దర్శింపజేయుము.

వినా రామచంద్రం న నాథోననాథః
సదా రామచంద్రం నమామి స్మరామి
విభో ! రామచంద్ర ! ప్రసీద ప్రసీద
ప్రియం యచ్ఛ మహ్యం ప్రభో ! రాఘవేంద్ర ! ౧౧

తా॥ రామచంద్రప్రభువు తప్ప వేరొక ప్రభువు లేడు. ఎల్లప్పుడు రామచంద్రునినే నమస్కరింతును . ఓ విభూ ! రామచంద్రా ! ప్రసన్నుడవుకమ్ము ! ఓ ప్రభూ ! రాఘవేంద్రా ! నాకు ప్రియము నను గ్రహింపుము .

అహం రామచంద్ర ! త్వదీయాంఘ్రియుగ్మం
సదా భక్తి భావేన సేవాం కరోమి
సకృత్తావ కీ నాంఘ్రి సేవా ఫలం త్వం
ప్రయచ్ఛ ప్రభో ! మే కృపా పూర్ణదృష్టిమ్ ౧౩

తా. ఓ రామచంద్రా ! భక్తి భావముచే మీ పాద పద్మములగు సేవచేయుదును; ఎల్లప్పుడు మీ పాద సేవాఫలమును మీ కృపాదృష్టిని నాకు ప్రసాదింపుము.

ఆజానతా మయానేకాన్ - కృతాన్ దోషాన్ జగత్పతే !
క్షమస్వ జానకీజాని ! - పాహి రామ ! నమామ్యహమ్ ౨౮

తా॥ ఓ జగత్పతీ ! తెలియక చేసిన అనేక దోషముల మన్నించి, ఓ సీతా రామ ! నమస్కరింతును, నన్ను పాలింపుము.

ఇతి శ్రీరామగిరి శ్రీరాఘవపతి స్తోత్రం సమాప్తమ్.
సర్వం శ్రీరామగిరిరాఘవపతి పాదపద్మార్పణమస్తు
ఈవిధముగా శ్రీరామ గిరివాసుడైన రాఘవపతి స్తోత్రం సమాప్తమ్ సర్వము
శ్రీరాఘవపతి పాదపద్మార్పణమగుగాక
శ్రీశుభంభవతు
-:/ ఇతిశమ్ /:-

శ్రీః

శ్రీహయగ్రీవాయ నమః

శ్రీసీతాలక్ష్మణ హనుమత్సమేత శ్రీరామ

పరబ్రహ్మణే నమః

# --:)(:: శ్రీరామచంద్ర ప్రపత్తిః ::)(:--

మాయా మానుషరూప రాఘవపతేః ధర్మాకృతేః ప్రేయసీం
తచ్ఛ్రీవత్స విశిష్ట కౌస్తుభమణి శ్రేష్ఠాంకితోరస్థలే !
నిత్యైకాంత నివాస మానిత సతీం తత్పాద పద్మాశ్రయాం
తాం దేవీం జనకాత్మజాం నుతగుణాం వన్దే సదా మాతరమ్ !

తా॥ ధర్మావతారుడైన మాయా మానుషస్వరూపుడైన రఘుపతికి ప్రేయసియు; ఆ స్వామి యొక్క శ్రీవత్సముతో కూడిన కౌస్తుభమణి గల వక్షస్థలమునయెల్లప్పుడునివసించునదియు; ఆ స్వామి పాదపద్మముల నాశ్రయించి యున్నదియు; కొని యాడదగు గుణములు గలదియగు నా జానకీ మాతను గూర్చి నమస్కరించుచున్నాను.

శ్రీమైథిలీ హృదయదివ్యగుణాభిరామ !
రాజాధిరాజ జనమానితరాజ రామ !
శ్రీధార్మికోత్తమ ! రఘూత్తమ ! తావకీనౌ
శ్రీరామచంద్ర! చరణౌ శరణం ప్రపద్యే ! ౧

తా॥ సీతాదేవి మనోగుణములకు చక్కనైనవాడా ! ఓ రాజాధిరాజ ! జనులతో గౌరవింపబడు ఓరాజరాజా ! రామచంద్రా ! రామా ! ఓ ధార్మికోత్తమ ! నీచరణములను శరణం పొందుచున్నాను.

రాజన్మనోజ్ఞ రతిరాణ్ణుత చారుసీమ !
సీతాసతీ హృదయపంకజ భృంగరాజ !
సౌశీల్య సద్గుణ గణాశ్రయ సత్యమూర్తే !
రామ ! త్వదీయ చరణౌ శరణం ప్రపద్యే !

తా॥ చక్కదనములతో వెలుగొందుచున్న మన్మథునితో కొనియాడబడు సౌందర్యము గలవాడా ! సీతాదేవి యొక్క మధురమైన మనోపద్మమున వసించు తుమ్మెరెడా ! సౌశీల్యాది గుణములకు ఆశ్రయమైన సత్యమూర్తే ! ఓరామా ! నీ చరణములను శరణం పొందుచున్నాను.

దుర్వారదైత్యరిపునాశక ధూమకేతో !
సృష్టిస్థితి ప్రళయ కారణ కార్యహేతో !
జ్ఞాన ప్రవాహ పరిరక్షక ధర్మసేతో !
రామ ! త్వదీయ చరణౌ శరణం ప్రపద్యే !! 3

తా॥ వారింపవీలు లేని దైత్య శత్రువుల వినాశకమగు దూమకేతువా ! సృష్టి స్థితి లయములకు కారణ కార్యములకు హేతువైన వాడా ! జ్ఞాన ప్రవాహమును రక్షించెడి ధర్మసేతూ ! ఓ రామా ! నీ చరణములను శరణం పొందుచున్నాను.

సీతా సతీ మధుర మంజుల చిత్తపద్మ -
భృంగాయ మాన లలితౌ సుజనైక సేవ్యౌ
సద్భక్త మానస సరోవర రాజహంసౌ
రామ ! త్వదీయ చరణౌ శరణం ప్రపద్యే !! ४

త॥ సీతా దేవి యొక్క మధురమనోహరమైన హృదయ పద్మమునకు భృంగాయమానము లైనవియు, చక్కనైనవియు సత్పురుషులకు సేవింపదగినవియు, సద్భక్తుల మనస్సనెడి మానస సరోవరమున విహరించెడి రాజహంసలైనవియునగు మీ చరణములను ఓ రామా ! శరణం పొందుచున్నాను.

రాజాధి రాజ నవరత్న కిరీట కోటి -
ప్రాచుర్య దివ్య మణి భూషిత పాదపీఠౌ
భక్త్యా సమీరతనయేన సుసేవి తౌ తే
శ్రీరామచంద్ర! చరణౌ శరణం ప్రపద్యే ౫

తా॥ చక్రవర్తుల కిరీటము లందలి మణులచే భూషింపబడు పాద పీఠములు గలవియు; భక్తితో హనుమన్నచే సేవింపబడుచున్నవియు; ఓ శ్రీరామచంద్ర! మీ చరణములను శరణుపొందుచున్నాను.

యోగీంద్ర యోగ పరిభూషిత మానసాబ్జే -
ష్వాముగ్ధ యౌవన విలాస నట న్మిళిందౌ
భక్తార్తి భంజన విధౌ పరిపూర్ణశక్తౌ
రామ! త్వదీయ చరణౌ శరణం ప్రపద్యే! ౬

తా॥ యోగీశ్వరుల యోగములచే భూషింపబడు మనోపద్మములందు అందముగా వయోవిలాసములతో నటించెడు తుమ్మెదలైనవియు, భక్తులయొక్క ఆర్తిని పోగొట్టుటయందు సమర్థములైనవియు నగు మీ పాప పద్మములను ఓ రామా! శరణు పొందుచున్నాను.

వేదత్రయీ వన విహార మనోజ్ఞ బర్హౌ
ప్రాచేతసోజ్జ్వల మనోనయనౌ విశేషౌ
భక్త్యా సహోదరవరైః పరిసేవి తౌ తే
శ్రీరామచంద్ర! చరణౌ శరణంప్రపద్యే!! ౭

తా॥ వేద వనములలో విహరించెడి చక్కని మయూరములైనవియు; వాల్మీకుల వారి మనోనేత్రములైనవియు భక్తి ప్రపత్తులతో భరతాది సహోదరులచే సేవింపబడునవియు; నగు మీ చరణములను ఓ రామచంద్రా! శరణు పొందుచున్నాను.

ఆర్తార్తి భంజన విధౌ మహితౌ సుశక్తౌ
ధూర్తారి రాక్షస వినాశక ధూమకేతూ!
సంసార సర్ప భయ నాశక వైనతేయౌ
రామ! త్వదీయ చరణౌ శరణం ప్రపద్యే!! ౮

తా॥ ఆర్తులైన వారి ఆర్తిని పోగొట్టుట యందు గొప్పనైనవియు; సమర్థము లైనవియు; ధూర్తులు శత్రువులునైన రాక్షసుల వినాశముగలుగ జేయుటలో ధూమకేతువైవియు, సంసారసర్పభయమునుపోగొట్టెడు లైన తేయములైనవియునగు మీ చరణములను ఓ రామా! శ్శరణం పొందుచున్నాను.

గంగానదీ తరణ సత్సమయే ప్రపత్త్యా
తన్నావికేన గుహునా చ కృతాభిషేకౌ!
తద్వార దీర్ఘ భవ సాగర తారకౌ తే
శ్రీరామచంద్రచరణౌ శరణం ప్రపద్యే ౯

తా. గంగానదిని దాటెడువేళలో నావికుడైన గుహునిచె అభిషేకింపబడినవియు ఆతని భావభగాతమైన సంసారమునకు తారకములైనవియునగు మీచరణములను ఓరామచంద్రా! శరణంపొందుచున్నాను.

కాకాసురేణ హితయోగ్య విభీషణేన
సుగ్రీవ వానర వరేణ వనే చరాద్యైః
ఆర్తప్రపత్తివిధిభిశ్చ సమాశ్రితౌ తే
శ్రీరామచంద్ర! చరణౌ శరణం ప్రపద్యే. ౧౦

తా. రాకాసురుడు, విభీషణుడు; సుగ్రీవుడు, వానరులు మొదలగువారిచే ఆర్తప్రపత్తి విధులచే ఆశ్రయింపబడినవిమునగు శ్రీరామచంద్రా! మీ చరణములను శరణం పొందుచున్నాను.

ఏ కాంత రమ్య నిలయే శయనే విశేషే
శ్రీ సీతయా లలితయా కరపల్లవాభ్యాం
సంవాహితౌ తదనవద్య కరాబ్జ రాగౌ
రామ ! త్వదీయ చరణౌ శరణం ప్రపద్యే !! ౧౧

తా॥ చక్కని యేకాంత మందిరమందు శయనవేళలో సీతాదేవిచే కరపల్లవము లతో సంవాహితములగుచున్నవియు, ఆమె కరపద్మముల రాగములు గలిగిమనోహరలైన వియు నగు మీ చరణ ములను ఓ రామా ! శరణం పొందుచున్నాను.

ధర్మైక శాసక విధౌ జనకాయమానౌ
వాత్సల్య పోషణ విధౌ జననీ సమానౌ
సన్మార్గబోధక విదౌ విబుధాయ మానౌ
రామ ! త్వదీయ చరణౌ శరణం ప్రపద్యే !! ౧౨

తా॥ ధర్మను శాసించెడి విధియందు జనకునివలెనుండునవియు; వాత్సల్యముతో పోషించెడి విధి యందు తల్లితో సమానమైనవియు; సన్మార్గములతో బోధించుట యందు ఆచార్యులవలెనుండునవియు; నగు మీ పాదములను ఓ రామా ! శరణం పొందుచున్నాను.

సాకేత వాస సుజనైః పరిసేవితౌ యౌ
యోగీంద్ర యోగ విధిభిః పరిభూషితౌ తే
తౌ మే ప్రదర్శయ మనోజ్ఞమయౌ పదాబ్జౌ
శ్రీరామ చంద్ర! చరణౌ శరణం ప్రపద్యే ౧౩

తా॥ ఏమీ పాదములు సాకేతపురజనుల చే సే వింపబడినవో యోగీంద్రుల యోగ విధులచే భూషింపబడినవో ఆ మీ పాదములను నాకు దర్శింపజేయుము. ఓ రామచంద్రా ! మీ పాదములను శరణం పొందుచున్నాను.

దివ్యాగమాది బహుశాస్త్రపురాణ కావ్య
శ్రీమ న్మహోపవన వీధి షు సంచరన్తౌ
సద్భక్త మానస మనోహర పారిజాతౌ
రామ ! త్వదీయ చరణౌ శరణం ప్రపద్యే !! ౧౪

తా॥ వేదశాస్త్ర పురాణ కావ్యాదులనెడి ఉద్యాన వనములలో సంచరించునవియు; సద్భక్తులహృదయములకు అందమైన పారిజాతములైనవియు నగు మీ పాదములను ఓ రామా ! శరణం పొందుచున్నాను.

శ్రీదుందుభీవర నదీ తట రామశైలే
శ్రీమందిరే వినుత భక్తజనానుసేవ్యౌ
సల్లాలి తౌ రహసి మైథిలినానురాగైః
రామ ! త్వదీయ చరణౌ శరణం ప్రపద్యే!! ౧౫

తా॥ సంపత్కరమైన దుందుభీనదీ తట మందలి రామగిరిలో గల మందిరమందు భక్తులకు సేవింపదగినవియు, ఏకాంత సమయమున అనురాగములతో సీతాదేవిచే లాలింపబడినవియు నగు మీ పాదములను ఓ రామా ! శరణం పొందుచున్నాను.

ఇత్థం చ రాఘవ పతే ర్లలితం ప్రపత్తిం
శ్రీశ్రీనివాస రచితం మహితం సభక్త్యా
యే సంపఠంతి సతతం ప్రతి సుప్రభాతే
తే ప్రాప్నువన్తి సకలార్థ మఖండ కీర్తిమ్ !! ౧౬

తా॥ ఈ విధముగ భక్తితో శ్రీనివాస విరచితమైన శ్రీరామ విభుని చక్కని ప్రపత్తి స్తోత్రమును ఎల్లప్పుడు ప్రతి సుప్రభాతవేళలో ఎవ్వరు పఠింతురో వారు సకల సంపదలను అఖండమైన కీర్తిని పొందు చున్నారు.

ఇత్థం
శ్రీరామగిరి రాఘవపతి ప్రపత్తి స్తోత్రం సమాప్తమ్
-ః(సర్వం శ్రీసీతారామ పాదపద్మార్పణ మస్తు ):ః-
-:ః:( ఓంతత్సత్ ):ః:-

శ్రీః
శ్రీః
శ్రీ హయగ్రీవాయ నమః
శ్రీ రామగిరి శ్రీ సీతాలక్ష్మణ హనుమత్సమేత-
శ్రీ రామచంద్రస్వామినేనమః

# -=:ః)O( శ్రీ రాఘవపతి మంగళాశాసనమ్ )O(ః:=-

శ్రీమత్సాకేత నాథాయ। - దుందుభీతీరవాసినే।
శ్రీ రామశైలనాథాయ - రామచంద్రాయ మంగళమ్ ౧

తా॥ సాకేతపురనాథుండైన; దుంధుభీతీరవాసుడైన; రామగిరివాసుడైన రాఘవస్వామికి మంగళము

శ్రీ సీతా సూరిసౌమిత్రి - వాయుజైస్సేవితాంఘ్రయే
సద్భక్త పారిజాతాయ - సార్వభౌమాయ మంగళమ్ !! ౨

తా. సీతాలక్ష్మణ హనుమదాదులచే సేవింపబడుచున్న పాదములుగలవాడైన; భక్తులపాలిట పారిజాతుడైన శ్రీ రఘురామ చక్రవర్తికి మంగళము

జానకీ మృదుమాధుర్య - మానసాంభోజ షట్పద !
ధర్మావతార ! లోకేశ ! తుభ్యం శ్రీ రామ ! మంగళమ్ !!

తా॥ సీతమ్మ యొక్క మృదువైనది మధురమైనది యగు హృదయ కమలమునకు తుమ్మెదవంటివాడా ! ఓ ధర్మావతార ! లోకేశ ! శ్రీ రామ ! నీకు మంగళము ! 3

రాజాధిరాజ రాజేంద్ర - మౌళి శ్రీ రాజితాంఘ్రయే !
శ్రీమత్పట్టాభిరామాయ - రామ చంద్రాయ మంగళమ్!!

తా॥ చక్రవర్తుల మౌళి ప్రభలతో విరాజిల్లు పాదములు గలవాడవైన
పట్టాభిరాముడవైన శ్రీరామచంద్రుడవైన నీకు మంగళము ! ४

మాయా మానుష రూపాయ - మనువంశోత్తమాయ చ !
యోగి హృత్పద్మ వేద్యాయ - వేదవేద్యాయ మంగళమ్!!

తా॥ మాయా మానుష స్వరూపుడైన, మనువంశోత్తముడైన యోగి
జనహృదయావేద్యుడైన వేదవేద్యుడైన వానికి మంగళము! ౫

మౌనిరాజ హృదబ్జాంత - ర్లీన మన్మథరూపిణే !
విశ్వమానవసేవ్యాయ - విశ్వరూపాయ మంగళమ్

తా॥ ముని రాజుల హృదయకమలాలలో దాగియున్న మన్మథుడైన,
విశ్వమానవులకు సేవ్యుడైన విశ్వరూపునికి మంగళము. ౬

ప్రాచేతసాది యోగీంద్రైః - యోగై స్సేవిత రూపిణే
మాన్య సద్భక్త సేవ్యాయ - మాననీయాయ మంగళమ్ !!

తా॥ వాల్మీకి మొదలగు యోగుల యోగములచే సేవింపబడిన
రూపము గల వాడైన భక్తసేవ్యుడైన మాననీయునికి మంగళము. ౭

ఆర్త సద్భక్త సంత్రాణ - బద్ధ కంకణ పాణయే
సాధు రక్షణ శీలాయ - సచ్చరి త్రాయ మంగళమ్ !!

తా॥ ఆర్తులైన సద్భక్తులను రక్షించుటయందు బద్ధకంకణుండైన, సాధు
జన రక్షణ శీలుడైన చక్కని చరిత్ర గలవానికి మంగళము. ౮

దుష్ట దైత్యారి మత్తేభ - యూథపంచాననాయచ
శిష్ట రక్షక దేవాయ - శ్రీశుభాంగాయ మంగళమ్!

తా॥ దుష్టులైన దైత్యులను మత్తగజముల సమూహములకుసింహ
మైన; శిష్ట రక్షకుండైన; శ్రీశుభాంగునికి మంగళము. ౯

వాసవాద్యామరై ర్భక్తైః
సద్భి స్సంసేవితాయ చ!
శ్రీమద్విశ్వ స్వరూపాయ
సీతారామాయ మంగళమ్!! ౧౦

తా॥ ఇంద్రుడు మొదలగు దేవతలచే భక్తులైన సజ్జనులచే
సేవింపబడువానికి విశ్వస్వరూపుడైన శ్రీసీతారామస్వామికి మంగళము

నీల జీమూత సంకాశ - నిర్మలానందరూపిణే
కారుణ్య పూర్ణ రమ్యాయ - కమలాక్షాయమంగళమ్!! ౧౧

తా॥ నీలమేఘముతో సమానమైన నిర్మలానంద స్వరూపుడైన వానికి
కారుణ్యముతో నిండిన చక్కనైన కమలాక్షునికి మంగళము.

వేదండ మదగంభీర - గామినే గుణశాలినే
బాణతూణీర కోదండ - ధారిణే జయమంగళమ్!! ౧౨

తా॥ మదించిన ఏనుగునడకవంటి గంభీరమైన నడకగల్గినవాడైన
గుణశాలియైన బాణతూణీరములను కోదండమును ధరించినవానికి
జయమంగళము!

సర్వ లోక శరణ్యాయ - సర్వలోకహితాయచ
సర్వ సద్ధర్మ రూపాయ - సత్యరూపాయ మంగళమ్!! ౧౩

తా॥ సర్వలోకములకు శరణ్యుడైన, సర్వలోకములకు హితుడైన
సర్వధర్మ స్వరూపుడైన; సత్యస్వరూపునికి మంగళము.

దుందుభీతీరరామాద్రి - మందిరాంతరవాసినే
సాధుసద్భక్త సేవ్యాయ - సచ్చరిత్రాయ మంగళమ్ !! ౧౪

తా॥ దుందుభీ తీరమందలి రామాద్రి మంది రాంతరమున నివసించి
యున్న వాడైన; సజ్జనభక్తసేవ్యుడైన; సచ్చరిత్రునికి మంగళము.

శ్రీదుందుభీనదీ తీర - రామా గిర్యాలయాంతరే
వాసినే మైథిలీ శాయ - రామచంద్రాయ మంగళమ్ ౧౪

తా॥ దుందుభీనదీ తీరమందలి రామగిరి మందిరమున నివసిం చినవాడైన మైథిలీ భునికి రామచంద్రునకు మంగళము.

శ్రీముడుంబాన్వయోజ్జాత
విబుధై స్సురభీశ్వరైః!
భక్తై స్సంసేవి తాయస్తు
రామ భద్రాయ మంగళమ్ !! ౧౬

తా॥ ముడుంబవంశమున జన్మించి పండితుల చేతను సురభి ప్రభువులచేతను భక్తుల చేతను సేవింపబడిన రామచంద్రుడవైన నీకు మంగళము !

మరిఙ్గంట్యాన్వయోజ్జాత - శఠగోపార్యాదిసజ్జనైః
సేవితాంఘ్రిద్వయాయాస్తు - సీతారామాయమంగళమ్ ౧౭

తా. మరిఙ్గంటివంశములో జన్మించిన శఠగోపార్యాలు మొదలగు భక్తులచే సేవింపబడు పాదములుగల సీతారాములకు మంగళము: -

శ్రీవైష్ణవప్రపన్నాద్యైః భక్తైస్సేవితాంఘ్రయే
శ్రీనివాసేడి తాయాస్తు - రాఘవేంద్రాయనమః

తా. శ్రీవైష్ణప్రపన్నులు మొదలగు భక్తులచే సేవింపబడు పాదములుగలవారైన శ్రీనివాసునిచే స్తుతించబడిన రాఘవేంద్రునికి మంగళము.

మంగళా శాసన పరై - ర్మదాచార్యపురోగమైః
సర్వైశ్చ పూర్వై రాచార్యై - స్సత్కృతాయాస్తు మంగళమ్ !! ౧౮

తా॥ మంగళాశాసనపరులైన అస్మదాచార్యులు మొదలగువారిచే సమస్తమైన పూర్వాచార్యులచే సత్కరింపబడినవానికి మంగళమగు గాత !

--:ః:( ఇతిశమ్ ):ః:--

ఇత్థం

శ్రీమద్భారద్వాజ గోత్రపవిత్ర శ్రీమాన్ నల్లదీగ నరసింహాచార్య

చూడమాంబాతనూజ శ్రీనివాస కవినా విరచితం

శ్రీదుందుభీనదీ తీరోపాంతవిలసిత శ్రీరామగిరిమన్దిరే విరాజమాన

శ్రీసీతాలక్ష్మణ హనుమత్సమేత శ్రీరాఘవపతి సుప్ర

భాతతంతర్గత శ్రీరాఘవపతి మంగళాశాసం సర్వం

శ్రీసీతా రాఘవపతి పాదార్పణ మస్తు

-:ః: ఓ తత్సత్ :ః:-

శ్రీ యువ సం. హేమంత శిశిరములు

-: శ్రీః :-

